# విశ్వప్రకాశం

ఆధ్యాత్మిక మాసపత్రిక




స్వస్తిశ్రీ ధాతు నామ సంవత్సర గురుపూర్ణిమ ప్రత్యేక సంచిక

జూలై, 1996



# సర్వార్ధ సంక్షేమ సమితి

501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్, గాంధీనగర్,
హైదరాబాద్ - 500 380 ఆంధ్రప్రదేశ్

## విన్నపము

విశ్వప్రకాశం, పాఠకులకు, దేవాలయాల అధికారులకు (E.O.గార్లకు), జిల్లా గ్రంథాలయాధికారులకు (సెక్రటరీ) ప్రత్యేక మనవి.

గత 18 మాసాలుగా విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రిక, ప్రతి నెలా మీ చేతికందుతుంది. ప్రతి తెలుగు మరియు ఆంగ్ల నూతన సంవత్సరాదులకు శుభాకాంక్షలు తెలియచేయుచు, పత్రికకు చందా చెల్లించాల్సిందిగా పత్రికాముఖంగా మనవి చేయుచునేయున్నాను. కాని స్పందన రావటంలేదు. అందుకే ప్రస్తుతం, ప్రత్యేకంగా మీకు లేఖ వ్రాయుచు, మీ స్పందన మరియు ప్రోత్సాహము కోరుచున్నాను.

దేవాలయాల E.O.గార్లకు ప్రత్యేక మనవి. భక్తి, ధార్మికత, ప్రశాంతతలకు మారుపేరు మీ దేవాలయాలు. ఈ ధార్మిక పత్రికలను చదువుట, చదివించుటయు మీ విధియని నా భావన. కాని పత్రిక నెల నెలా కనీసం విప్పి చూస్తున్నారా? యనే సందేహం కలుగుతుంది. దాదాపు 400 దేవాలయాలకు ఈ పత్రిక చేరుచుండగా, 5% అంటే 20 దేవాలయాధికారులు కూడా రూ.60/-ల చందా చెల్లించలేదనే సత్యం ఎంత బాధాకరం? కనీసం ఒక కార్డు ద్వారా వారికి పత్రిక అవసరం లేదని తెలుపవచ్చు గదా! సంవత్సర చందా రూ.60/-లు చెల్లించలేని దేవాలయం ఒకటి కూడా లేదనేది సుస్పష్టం. కావున ఇప్ప టికైనా E.O.గారలు కనీసం రెండు సం.ల చందా రూ.120/- వెంటనే

పంపగలరు. దేవాదాయ కమీషనరు కమెండేషనులోగా అక్టోబరు 95 పత్రికలో ముద్రించి తెలియ చేసినాము.

అలాగే గౌరవనీయ జిల్లా గ్రంథాలయ సెక్రటరీ గారలకు కూడా ప్రతి నెలా పత్రిక మరియు, విన్నపాలు పంపుచునే యున్నాను. కాని జిల్లా గ్రంథాలయాధికారులనుండి వారివారి ఉప గ్రంథాలయాల అడ్రసులు కాని, ఆర్డర్లు కాని ఏ మహాశయుడును పంపలేదు. నేటి కలుషిత, దుష్ట విశ్వాసరహిత వాతావరణంలో, ఈలాటి ధార్మిక పత్రికల పాత్ర, సమాజానికి ఎంతో అవసరం. మరి ఈ పత్రికలు గ్రంథాలయాల్లో లభించకుంటే, ప్రజలు చదువలేకుంటే, ఎంతో కష్టనష్టాలకోర్చి, పత్రిక నడుపుట వృధా ప్రయాసే కాగలదు. దయచేసి ఇప్పటికైనా జిల్లా గ్రంథాలయాధికారులు, తమ యేలుబడిలోని ఉప గ్రంథాలయాల చిరునామాలు, ఆర్డర్లు, అడ్వాన్సు చెక్కులు మరియు రెండు సం.లకు మీరు పొందు పత్రికల చందాయుక్తం పంపగలరని ప్రార్థన.

అలాగే మిత్రులకు, శ్రేయోభిలాషులకు, పత్రికాభిమానులకు, బంధువులకు ఈ ప్రత్యేక విన్నపము వర్తించునని భావించి, చందాలు పంపగలరు.

*గమనిక:- చందాలు పంపిన వారికి, పోషకాది దాతలకు, స్వాములకు, పీఠాధిపతులకు, కళా, కవి, పండిత మిత్రులకు పై విన్నపము వర్తించదని గమనించాలి.*

ఇట్లు

మీ

పి.వి. మనోహర్ రావు

ము. సం.

# విశ్వప్రకాశం

అధ్యాత్మిక మాసపత్రిక

స్వస్తిశ్రీ ధాతు నామ సంవత్సర గురుపూర్ణిమ ప్రత్యేక సంచిక

జూలై, 1996

సంపుటి : 2 సంచిక : 9 వెల : రూ. 5-00



ప్రకాశకులు
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్
గాంధీనగర్, హైదరాబాద్ 500 380

ఈ సంచికలో ...............



ముఖచిత్రం : భగవత్పాదుల బోధ (శ్రీ 'బాపు' సౌజన్యంతో)

## సంపాదకీయం

# గురుపూర్ణిమ

"మన హృదయంలో ఉన్న పరమేశ్వరుని అనుభవంలోనికి తెచ్చుకోవటానికి గురువు యొక్క అనుగ్రహం ఎలా సహకరిస్తుంది (అని అడుగుతున్నారు)! గురువు అంటే ఆత్మ. నీ హృదయంలో ఉన్న సద్వస్తువు వేరు, గురువు వేరు కాదు. నీ హృదయంలో మరణం లేవి వస్తువు ఒకటి ఉంది. అదే గురువు. అదే ఈశ్వరుడు. అదే ఆత్మ. పేర్లు వేరు గాని ఉన్నది ఒక్కటే. మన మనస్సును పవిత్రం చేసే ఆ సద్వస్తువును తెలుసుకొనేటట్టు మనలను అనుగ్రహించటం కోసం మన లోపల ఉన్న ఆ సద్వస్తువే కాళ్ళు చేతులు తొడుక్కొని బాహ్యంగా రూపం ధరించి వస్తుంది. మన శరీరాలు అన్నీ బొమ్మలే. మాంసంతో తయారు చేస్తారు. మనకు నామదృష్టి, రూప దృష్టి ఉంది. రూపదృష్టికి, నామదృష్టికి అతీతమైనది సద్వస్తువు. బాహ్యంగా ఎందుకు రూపం ధరించి వస్తుందంటే నిజమైన వస్తువును తెలియ జేయటం కోసం, మనకు బోధచేసి మనలను పవిత్రం చేసి మనస్సులో ఉన్న దోషములను తొలగించి మన మనస్సును అంతర్ముఖం చేయటానికి బాహ్యమైన గురువు సహకరిస్తాడు".

అన్నారు శ్రీ జిన్నూరు నాన్నగారు. శ్రీ నాన్నగారు అరుణాచల శ్రీరమణుని దివ్య ప్రబోధాలను సరళంగా సుబోధకంగా ఆకర్షకంగా తెలుగువారికి అందిస్తున్న ఆధ్యాత్మికాచార్యులు. పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు సమీపాన వీరి ఆధ్యాత్మిక బోధ ప్రసార కేంద్రం జిన్నూరులో ఉంది. వారంలో ఐదు రోజులు వీరు ఆ సమీపాన గ్రామాలలోను ఇంకా ఇతర పట్టణాలలోను శ్రీ రమణుల దివ్యవాణిని అత్యంతోత్తేజకంగా వినిపిస్తుంటారు. అశేష సంఖ్యాతో శ్రోతలను బాగా ఆకట్టుకుంటారు. వారు మాట్లాడుతూ ఉంటే శ్రీ రమణుల దివ్యతత్వ బోధ అంతా మనకు అర్థమవుతూనే ఉంటుంది. అర్థమవుతున్నట్లు ఉంటుంది. అదీ ఆయన విశ్లేషణలోని ఆకర్షణ.

"మానవులకు క్రమశిక్షణమును బోధపరచి ధర్మమును ఆచరణ రూపమున స్థిర పరచువాడు జగద్గురువు............ అతడు మానవుని రూపమున అవసరమైనపుడు మానవులలోనికి దిగి వచ్చును. రాముడు, కృష్ణుడు, గౌతమ బుద్ధుడు, ఏసుక్రీస్తు,

మైత్రేయుడు మొదలగు రూపములతో దిగి వచ్చినది అతడే. ఈ దిగి వచ్చువారే అవతారములు. అవతారముల రూపమున ఒకే జగద్గురువు దిగి వచ్చును".

అన్నారు మాస్టర్ ఇ.కె. మహాశయులు. శ్రీ ఇ.కె. మాస్టరుగారంటే శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు. వీరిని జగద్గురువుగా ఆరాధించి సమాజసేవ చేసే ఒక వ్యవస్థ ఉన్నది. ఈ వ్యవస్థ లోకానికెంతో ఉపకారం చేస్తున్నది. ఉచిత హోమియో వైద్యం, హోమియో వైద్య బోధన, యోగ, ధ్యాన, ఉపాసన, అర్చన ప్రచార ప్రబోధాలు ఈ జగద్గురు బోధన కేంద్ర సంప్రదాయంవారు నిర్వహిస్తారు. భారతీయ సంస్కృతి పరమార్థాన్ని ఆచరణాత్మకంగా ప్రేమపూరితంగా ప్రబోధిస్తారు. దివ్య జ్ఞాన సమాజం వారి ఆశయాలకు దగ్గరగా ఉంటుంది వీరి నడవడి.

భారతీయ సంస్కృతిలో ఈ 'గురు' సంప్రదాయానికి అత్యంత ప్రాధాన్య మున్నది. ప్రాముఖ్యమున్నది. 'ఆస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్' ప్రతి సాధకుడు, బోధకుడు గురువుకు సర్వస్వార్పణం, స్వాత్మార్పణం చేసుకోవాలని భావిస్తాడు. 'గురువు' అనే పదం ద్వారా వచ్చిందే 'గౌరవం' అనే మాట. "ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాం శతంపితా! సహస్రంతు పితౄన్‌మాతా! గౌరవేణాతిరిచ్యతే' ' అని మనుస్మృతి విధిస్తున్నదట. 'పదిమంది ఉపాధ్యాయులకంటె ఆచార్యుడు అధిక గౌరవార్హుడు. నూర్గురు ఆచార్యుల కంటె తండ్రి, తండ్రి కంటె వేయి రెట్లు తల్లిన్నీ పూజనీయులు" అని మనుస్మృతి చెపుతుండగా నిష్కారణంగా ఆ స్మృతి మహిళలను గౌరవించటం లేదని నిందిస్తారు కొందరు. తల్లిని గౌరవించటమంటే మహిళాలోకాన్నంతా గౌరవించటం కాదా! అభ్యుదయవాదులు, విప్లవ-ప్రగతి ప్రతిపాదకులు మనది పితృస్వామ్యవ్యవస్థ అని ఈసడిస్తారు. కాలాంతరాన భారతీయ సంస్కృతిలో సమాజ జీవనంలో, సాంఘిక వ్యవస్థలో అనేక కల్మషాలు ప్రవేశించి ఉండవచ్చు. ఆచరణలో ధర్మలోపం సంభవించి ఉండవచ్చు. కాని భారతీయ సనాతన ధర్మాన్ని సంస్కృతిని తప్పుపట్టడం తప్పు. బృహదారణ్యకోపనిషత్తుకు భాష్యం వ్రాస్తూ ఆదిశంకర భగవత్పాదులవారు కూడా ప్రస్తావనగా 'మాతాచసమ్యగనుశాస్త్రీ అనుశాసనకర్త్రీ' అని చెప్పారుట. అంటే సమాజాన్ని సక్రమంగా శాసించేది తల్లే అని చెప్పారు. అంటే ఏ సమాజంలో తల్లి స్థానం అత్యంత గౌరవార్హమో ఆ సమాజానికి శుభోదర్కం అని.

ఈ భావాన్నే నన్నయ్యగారు ఇట్లా వ్యాఖ్యానించారు. 'గురువులలోన పరమ

గురువు తల్లియ, తల్లి పనుపు విధాతృసేతయు మీరనలవియగునే' అని. ఇతర దేశాలమాట ఇతర ఆధ్యాత్మిక సంప్రదాయాల మాట ఏమోకాని భారతదేశంలో గురుపూజ అనాదికాలం నుంచీ కనపడుతూ వుంది. గొప్ప గొప్ప సిద్ధయోగులు ఆధ్యాత్మిక దివ్యపురుషులు అందరూ గురుసంప్రదాయాన్ని పాటించినవారే.

భారతదేశంలో యగయుగాలుగా ఈ గురు శిష్య సంప్రదాయం వర్ధిల్లుతున్నది. పురాణపురుషులు, అవతారమూర్తులు కూడా గుర్వానుగ్రహాన్ని అర్థించినవారే. శ్రీరామచంద్రుడికి గురువున్నాడు, శ్రీకృష్ణుడికి గురువున్నాడు. సర్వలోక జనయిత్రి శైలబాల కూడా గురుముఖతః విద్య నేర్చిందన్నాడు కాళిదాసు.

పరివ్రాజకు లందరికీ గురుపరంపర సంప్రదాయమున్నది. శంకర భగవత్పాదుల వారి నుంచి నేటి వరకు అద్వైత సంప్రదాయ గురుపరంపర ఆయా మఠాలలో లిఖిత పరిరక్షితమై ఉంది. ఆధునిక తపస్వులలో, మహాయోగులలో ఆధ్యాత్మిక దివ్యమహిమోపేతులలో అందరికీ గురువు లున్నారు. ఒక్క రమణ మహర్షికి తప్ప. ఆయన సాక్షాత్తు దక్షిణామూర్తియే. అందుకనే మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వ స్వరూపులాయన. అయినా గురువు యొక్క అనుగ్రహాన్ని ఆయన నొక్కి చెపుతారు. గుర్వనుగ్రహం ఏటువంటిదంటే ఆయనే నీ లోపల సాక్షాత్కరించి ఆకర్షించి నిన్ను ఆత్మదర్శనుణ్ణి చేస్తాడు, బయట నుంచి నిన్ను నీలోకి నెడతాడు అంటారు భగవాన్ శ్రీరమణులు. శ్రీ జిడ్డు కృష్ణమూర్తి మహోదయులు నీ ఆత్మానుభవమే నీకు గురువంటారు. వేరే గురువు అక్కరలేదంటారు. ఏమైనా భారతీయ సంస్కృతిలో గురువు స్థానం పదిలం. శైవులు కానీండి, వైష్ణవులు కానీండి, శాక్తేయులు కానీండి, అద్వైతులు కానీండి గురువులేని విద్య గుడ్డి విద్య అనే నమ్మకాన్నే వ్యక్తీకరిస్తారు.

ఆషాఢ పూర్ణిమ గురు పూర్ణిమ. ఆనాడు భారతీయులు గురుపూజను నిర్వహిస్తారు. ఐదువేల సంవత్సరాల నుంచీ అనూచానంగా వస్తున్న సంప్రదాయం. ఆధునిక యుగ భారతదేశానికి పునరుజ్జీవనం ప్రసాదించిన మహనీయుడు శంకరభాగవత్పాదులవారు. కునుకుతున్న భారతీయ సంస్కృతిని ప్రజ్వలింప చేసినవారు. భారతదేశం నాలుగువైపుల చతురామ్నాయ పీఠాలు స్థాపించి భక్తి, జ్ఞాన కర్మ యోగా లను పునరుద్ధరించినవారు భగవత్పాదులు. ఆయన చేసిన గొప్ప కృషిని గూర్చి శృంగేరి

శంకరాచార్య పీఠాధిష్ఠితులు శ్రీ భారతీతీర్థస్వాముల వారీ విధంగా చెప్పారు.

"శంకరభగవత్పాదుల వారి జీవితమును పరికించినచో కేవలము ముప్పది రెండు సంవత్సరముల అయుస్సు వారిది. ఆ ముప్పది రెండు సంవత్సరముల ఆయుః పరిమాణము నందు సమస్త భారతదేశమును కేవలము పాదచారియై రెండు మారులు ప్రదక్షిణము చేసి దేశమునందున్న అవైదికమతానుయాయులను విద్వాంసుల నందరును వైదికమతానుయాయులుగా ఒనర్చిరన్నప్పుడు వారి యొక్క వాదన పటిమ ఎట్లుండియుండవలెనో వారి భాష్యగ్రంథములను చూచినచో వారికి తమ ఔపనిషద సిద్ధాంతము నందున్న శ్రద్ధ ఉపనిషత్సిద్ధాంతమునకు భిన్నములగు మతములందలి దౌర్బల్యమెంతయున్నదన్న వారి తీర్మానము మనకు స్పష్టముగా తెలియును. వారే ఒకచోట ఉపనిషద్భాష్యము నందు 'అనేకులగు ప్రతికక్షులు వారికి కలరు' అన్న ప్రతివాది యొక్క వాక్యమునకు జవాబునిచ్చుచు -

"ఏత దేవమే స్వస్త్యయనం - యన్మామేక యోగిన మనేక యోగి బహుప్రతి పక్షమాత్థ! అతో జేష్యామి సర్వా నారభేచచింతామ్" (తైత్తిరీయభాష్యం 2-8)

అని ఉద్ఘోషించినారు. ఆ మహానుభావునికున్న ఆ సాహసముకాని ఆయన హృదయము నందున్న ఆ పరినిష్ఠితమగు జ్ఞానముకాని, ఆయన హృదయమునందలి సమస్త విశ్వమునకు కళ్యాణమును చేయవలయునను మహోన్నతమగు తలంపుకాని యింక యెవరికి వుండెనో నాకు తెలియదు. లేనిచో ఆ వ్యక్తి నోటి నుంచి ఆమాట వచ్చునా! ఇంత మంది ప్రతిపక్షులు నాకున్నారని అనుచున్నావు. అది నాకు మంగళకరము. "ఏతదేవమే స్వస్త్యయనం" అనినాడు. అనగా నన్ను ఒకడను ఎదిరించుటకు మీరింతమంది వచ్చి కూర్చుంటిరే - అనగా మీరింత మంది నన్ను 'జ్ఞాని' అనుకొని, వచ్చిరికదా. మీరందరకు నేను సమాధానము చెప్పగలను. ఔపనిషదమగు సిద్ధాంతమును ప్రతిపాదించగలను." అని ఆయన ఢక్కారావమును చేసి చెప్పినాడు".(గురుశిష్య సంబంధాలు : పూర్వాదర్శాలు, ప్రస్తుత పరిస్థితులు - పుటలు 31-32, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి, 1978).

ఇంకా శ్రీ భారతీతీర్థ మహాస్వామి భగవత్పాదులవారిని ఆయన స్తోత్రవాఙ్మయ సృష్టికి బహుధా ప్రశంసించారు. శంకరులు సమస్త విశ్వకళ్యాణంకోసం ప్రబోధించిన మహనీయులని ప్రతిపాదించారు.

శంకరులు తామొక్కరు మోక్షం సంపాదిస్తే చాలునని అనుకోలేదు. సాంఘికోద్ధరణను మహదాశయంగా చేసుకున్నారు. ఆయన 'మనీషాపంచకం' ద్వారా అస్పృశ్యత ఆచరణను తుత్తునియలు చేశారు. 'కనకధారాస్తోత్రం' ద్వారా భౌతిక సంపదను సృష్టించి దాని ఆవశ్యకతను నిరూఢం చేశాడు. నర్మదానదికి వరదలు రాగా శాసించి సాంఘిక సంక్షేమానికి పాటుపడ్డారు. ప్రజలలో విద్యావిజ్ఞానాలు వెదచల్లారు. ప్రజలందరికీ ఒక ఆర్థిక వ్యవస్థ వినిమయం జరిగేట్లు దేవాలయ నిర్మాణాన్ని, మఠప్రతిష్ఠాపనలను ప్రోత్సహించారు.

ఆయా ప్రాంతాల రాజులను వైదిక విద్యల సువ్యవస్థితమైన ప్రచారంకోసం ఉద్బోధించారు. తాము తమ మఠాలలో స్వయంగా శాస్త్రపరీక్షల సంప్రదాయాన్ని నెలకొల్పి శాస్త్రవిద్యల వ్యాపనాన్ని సుగమం చేశారు. అప్పటినుంచి గురుపూజా మహోత్సవాలకు మరింత ప్రాచుర్యం కలిగి ఉండవచ్చు.

ఆషాఢమాసంతో వర్షర్తువు ప్రారంభమవుతుంది. యతులు చాతుర్మాస్య దీక్షితులవుతారు. అంటే వారొక్కచోటనే నాలుగుపక్షాలో నాలుగుమాసాలో ఉండిపోతారు. అప్పుడు ఆ ప్రాంతాలలో ఉండే విద్వాంసులంతా వారిని సేవించుకుంటారు. వేదవిజ్ఞానం, శాస్త్రవిజ్ఞానం ఏవిధంగా ప్రజలలో ఆదృతమవుతుందో యతీశ్వరులకు పరీక్షించే అవకాశం అప్పుడు కలుగుతుంది. ఈ విధంగా గురుపూజా మహోత్సవాలు ప్రారంభమవుతాయి. విజయదశమినాడు శాస్త్రసదస్సులు జరుగుతాయి. ఇది పరంపరాగతమైన సంప్రదాయం. భారతీయ సంస్కృతిని వ్యాస, వాల్మీక, కాళిదాస, భవభూతి, భగవత్పాద, విద్యారణ్య, శ్రీ రామకృష్ణ, అరుణాచల రమణ, అరవింద, వివేకానంద, రామతీర్థ,చంద్రశేఖరేంద్ర, సత్యసాయి, విశ్వయోగి గురుపరంపర ఆయా కాలావధిగా రక్షిస్తూ వస్తోంది. ఎన్ని సంఘర్షణ లుప్పతిల్లినా, ఎన్ని విఘటనలు ప్రాప్తించినా హిమాలయం వలె అది సుస్థిరం. గంగ వలె నిరంతర ప్రవాహశీలం.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః
శ్రుతి స్మృతి పురాణానాం। ఆలయం కరుణాలయం।
నమామి భగవత్పాదం। శంకరం లోక శంకరం।



# అంజలి

- శ్రీ కళ్యాణ రంగాచార్యులు

తే.గీ. విశ్వకవిగన్న భారతి విశ్వమాత
శాంతి చిహ్నము మువ్వన్నె జాతి జెండ
ఎల్లదేశాల తాచాటె వెలుగునెత్తి
విశ్వశాంతి నెలకొలుప విశ్వమందు
విశ్వ విజయ సంధానపు విశ్వకాంతి
పుంజముల వెదజల్లిన పుణ్యభూమి
కర్మభూమి విశ్వంజీని కన్నభూమి
విశ్వకర్మ సృష్టించెనీ విశ్వమందు
దత్తఅవతార పురుషుడై ధాత్రియందు
విశ్వనాథశాస్త్రియనగ విశ్వమాన
వాళినొక్కటి జేయగా వసుధయందు
జన్మమొందిన మహాత్మ జనులుమీకు
అంజలించరే విశ్వంజి యనుచు నేడు.

దివ్యయోగి చరితామృతం

# పరమహంస కొండయాచార్య స్వామి

(1834 - 1939)

- ఆచార్య బిరుదురాజు రామరాజు

*(గత సంచిక తరువాయి)*

ఒకప్పుడు కొండయార్యులు సిర్పూర్ తాలూకా పెంచికలపేట గ్రామంలో తమబంధువులు వీరమాహేశ్వరులు మూలమఠం బండయ్య నిరంజనమయ్య ఇంటిలో ఐదు దినాలున్నారు. ఆ గ్రామంలో పెద్ది హనుమయ్య లక్ష్మీబాయి దంపతులు గొప్ప శ్రీమంతులు. వారికి ఒకే కొడుకు సాంబయ్య. మరొక కొడుకుకోసం దంపతులు స్వామిని ఆశ్రయించి కొలచినారు. స్వామి అనుగ్రహంతో పుట్టిన మరొక కొడుకుకు కొండయ్య అని నామకరణం చేసినారు. పెంచికల పేటకు సమీప గ్రామం గిరవెల్లి. అక్కడ కొయ్యడ మాశగౌడు అనే స్వామి భక్తుడు మూడునెలల నుండి ఏమందుకూ లొంగని జ్వరంతో మంచం పట్టి మరణాసన్నుడైనాడు. గురువు సన్నిధిలో చస్తే మోక్షమైనా లభిస్తుందని ఎంతో ప్రయాసపడి పెంచికలపేటలో గురువున్న తావుకు చేరినాడు. అక్కడ వేలభక్తులు స్వామి చుట్టూ చేరి భజన చేస్తున్నారు. మాశగౌడు మెల్లమెల్లగా స్వామిని సమీపించి కాళ్ళపైనబడ్డాడు. స్వామి తమ పాదుకతో బలం కొద్ది కొట్టటం ప్రారంభించినారు. గౌడు మూర్ఛితుడైనాడు. అతడు చనిపోయినాడనుకున్నారు చుట్టున్న భక్తులు. స్వామి నడిగే ధైర్యం ఎవరికీ లేదు. గంట తరువాత భజన ముగిసింది.స్వామి భక్తులకు తీర్థప్రసాదాలు పంచుతూ మాశగౌడును పిల్చినారు. నిద్రనుంచి లేచినవాని వలె స్వస్థునివలె గౌడు లేచిపోయి తీర్థప్రసాదాలు తీసుకొని గురువు తనపై కురిసిన అనుగ్రహవర్షానికి తడిసి ముద్దైపోయి నోరార కీర్తించినాడు, తనకు మంత్రోపదేశం చేయవలసిందిగా ప్రార్థించినాడు. స్వామి ఆతని కోరిక తీర్చినారు.

చెన్నూరు తాలూకా వేమనపల్లి జాగీర్దారు కాశీబాపురావు. అతని గుమాస్తా పద్మశాలి గుండపల్లి గంగయ్య దైవభక్తుడు, సాధుసత్పురుష సేవాసక్తుడు. కొండయార్యులు గిరవెల్లి మీదుగా ప్రయాణించి వేమనపల్లి చేరినారు. ప్రజలు స్వామికి భక్తులు కనుక గొప్పగా స్వాగతించి బ్రహ్మరథం పట్టి ఊరేగించినారు. స్వామివారు గంగయ్యను పిలుచుకొని తెలివైనవాడవనీ భక్తుడవనీ మెచ్చి దీక్ష యిచ్చి గ్రామాల్లో తిరుగుతూ భక్తిజ్ఞాన వైరాగ్యములు ప్రబోధించుమని ఆదేశించినారు.

గంగయ్య తన గుమాస్తా పని విడిచిపెట్టి, చుట్టుప్రక్కల గ్రామాల్లో ధర్మప్రబోధం చేస్తూ స్వామి వెంట పర్యటిస్తుండేవాడు. కొంతకాలం తర్వాత ఆయాగ్రామాల్లో భక్తులు గంగయ్యకు చేసే మరియాదలకూ సన్మానాలకు అతనిలో అహంకారం పెరిగింది. తానే గురువైనట్లు గర్వించసాగినాడు. కొండయార్యులు నిమిత్తమాత్రులనీ తానే గురువునంటూ ప్రచారం మొదలుపెట్టినాడు. సిర్వంచ తాలూకా కొత్తూరులో విడిది చేసి ఉన్న కొండయార్య స్వామికి ఈ వార్తను అక్కడి భక్తులు మోసుకవచ్చినారు. శాంతగంభీరులైన స్వామి వారిని సమాధానపరచి ఆ వ్యవహారం తామే చక్కబరుస్తామని వీడ్కోలు చెప్పినారు. కొన్నిదినాల పర్యటన తరువాత స్వామి మరల వేమనపల్లి చేరినారు. అక్కడి భక్తులందరూ వచ్చి దర్శించినా గర్వం తలకెక్కిన గంగయ్య మాత్రం దర్శనానికి రాలేదు. స్వామి స్వయంగా గంగయ్య ఇంటికి పోయి గిరవెల్లి ప్రయాణానికి బండికట్టుమన్నారు. గంగయ్య బండికట్టినాడు. బండిలో స్వామి, వెనుక కాలినడకన కొందరు భక్తులున్నారు. గంగయ్య బండి తోలుతున్నాడు. అది దట్టమైన అడవి. అడవిలో భయమేమీ లేదుకదా అని స్వామి అడిగితే పులి భయం ఉందన్నాడు గంగయ్య. తత్క్షణమే ఒక పులి బండికి ఎదురువచ్చింది. స్వామి ఆ పులితో "ఎందుకు వచ్చినావు? ఎడ్లను తింటావా? బండి వెనుక నడచే చిన్నను (భక్తుని) తింటావా? లేక నన్ను తింటావా?" అన్నారు. పులి కదలలేదు. "ఈ గంగయ్యను తింటావా?" అని స్వామి ప్రశ్నించగనే పులి గాండ్రుమని లంఘించింది. గంగయ్య స్వామి పాదాలపై బడి తన అహంకారానికి శాస్తి జరిగిందంటూ గోడుగోడున ఏడ్చి క్షమాభిక్ష కోరినాడు. స్వామి క్షమించి ఇక బండి తోలుమన్నారు. మనిషిలోని అహంకారం మితిమీరితే అది పులియై పతనానికి దారితీస్తుందనే గుణపాఠం దృష్టాంతపూర్వకంగా స్వామి గంగయ్యకు నేర్పినారు.

శ్రావణమాసంలో పరమహంస కొండయార్యులు తమ ధాభా మఠంలో నెలదినాలు లక్ష బిల్వార్చన, అగ్నిగుండాలు, ప్రభలు నిర్వహించేవారు. వచ్చిన భక్తులకు మానవ జన్మలోని ఉత్కృష్టతను గూర్చి, ఆత్మజ్ఞానం గూర్చి, ఆ జ్ఞానం ద్వారా జనన మరణాల కతీతమైన బ్రహ్మానంద పదవి గూర్చి, భక్తివైరాగ్యముల గూర్చి, లింగార్చనావిధానం గూర్చి బోధించేవారు. తమ ప్రసంగాల్లో స్వామివారు రామకృష్ణ పరమహంస, పోతులూరి వీరబ్రహ్మం, తుక్డోజీ మహారాజు, అడ్కోజి మహారాజు, గజానన మహారాజు, షిర్డీ సాయిబాబా వంటి మహాత్ముల ప్రవచనాలు చెప్పేవారు.

నెలదినాలు స్వామి సన్నిధిలో సత్సంగం చేసి కృతార్థులై భక్తులు తమ తమ గ్రామాలకు పోయి స్వామి మహిమలు తలుచుకుంటుండేవారు. స్వామివారు మరల శిష్యసంచారం బయలుదేరేవారు.

ధాభా సమీపగ్రామం హిప్‌రా. స్వామి భక్తుడు పైకన్ పటేలు ఆ గ్రామవాసి. విలువైన అతని మంచి యెద్దు జబ్బుపడి చావసిద్ధమైనది. అప్పుడే స్వామి వారింటికి వచ్చినారు. పైకన్ పటేలు స్వామిని పూజించి సేవించి తన ఎద్దును గురించి విన్నవించినాడు. స్వామి ఎద్దు దగ్గరకు పోయి దానిపై భస్మం చల్లి చేతితో వీపుపై గట్టిగా చరచినారు. వెంటనే అది లేచి నిల్చినది. మేత మేసినది. చుట్టు మూగినవారు స్వామి మహిమను విభూతి మహిమను కొనియాడినారు. చాందా జిల్లాలోని ఆహిరి సంస్థానంలో గణపూర్ ఒక గ్రామం. అది ప్రధాన మార్గంలో ఉండటం చేత బండ్లలోను కాలి నడకను పోయేవారు. ఆ రహదారిలో అగి విశ్రమించేవారు. ఐతే అక్కడ నీటి ఎద్దడి. ఆ గ్రామం ప్రజలు మరొక గ్రామం నుండి వేసవిలో నీళ్ళు తెచ్చుకునేవారు. దారిప్రక్కన త్రవ్వించిన బావిలో వేసవిలో నీరుండేది కాదు. ఒకసారి కొండయార్యులీ మార్గాన ప్రయాణం చేసి గణపూర్‌లో నిల్చిపోయినారు. అచ్చటి భక్తులు ఘనంగా సత్కారాలు చేసినారు. స్వామి ఆ గ్రామీణుల నీటిబాధను గుర్తించి దారిప్రక్క బావినుండి నీరు తెమ్మన్నారు. భక్తులా బావి ఎండిపోయినదన్నారు. భక్తులు వెంటరాగా స్వామి ఆ బావి వద్దకు పోయి నూతి గట్టుపై కూర్చుండి తదేకంగా చూస్తూ, గంగాధరుణ్ణి స్తుతించినారు. స్తోత్రం ముగిసేవరకు నీరు బావిపైకి పొంగివచ్చింది. హిప్రావాసి పులుగం హీరోజీకి మంచి పశుసంపద ఉంది. అందులో బలిష్ఠమైన ఒక దొంగ ఆవు కూడ ఉన్నది. అది రైతుల పైర్లు మేసేది. ఎవరికీ చిక్కేది కాదు. ఎవరైనా పట్టటానికి పోతే కుమ్మి తొక్కివేసేది. మిగతా రైతులు హీరోజీని నిందించేవారు. ఆవుతో పాటు హీరోజీని ఊరు విడిచి పొమ్మన్నారు. హీరోజీ స్వామికి మొరపెట్టుకున్నాడు. స్వామి దానిని దువ్వి దీవించినారు. స్వామి ఆశీర్వాదంతో ఆ గొడ్డు పొగరుబోతుటావు మూడుదూడలను కన్నది, సాధువైనది. ఈ గ్రామంలో స్వామి చూపిన ఈ రెండు మహిమలు షేగాంవ్ గజానన మహారాజు మహిమలను తలపిస్తాయి.

చెన్నూరు తాలూకా ఇందారం జాగీర్దారు ముత్యంరావు వెలమ దొర. ఆయన సోదరి విమల రూపవతి, గుణవతి. ఐతే ఆమె శరీరం నుండి దుర్గంధం వచ్చేది. ఆమె ఎన్నో మందులు తిన్నది. అనేక తీర్థయాత్రలు చేసి పుణ్యనదుల్లో స్నానం చేసింది. కాని ఆ వ్యాధి నయం కాలేదు. ఈ బాధకు ఆమె సిగ్గుతో అంతఃపురం విడిచి బయటికి

రావటానికి, చుట్టాల ఇండ్లకు పోవటానికి సిగ్గుపడేది. కొండయార్య స్వామి మహిమలు విని ముత్యంరావు సోదరిని తోడ్కొని ధాభాకు పోయి స్వామికి నమస్కరించ తమ దుస్థితి చెప్పటానికి వెనుక ముందాడుతున్నాడు. సర్వజ్ఞులైన స్వామి విమలను దగ్గరగా పిల్చుకొని తమ చేతితో ఆమె ఒడలంతా స్పృశించి మఠం బావినీరుతో స్నానం చేసి రమ్మన్నారు. ఆమె స్నానం చేసి రాగానే భస్మం పూసినారు; దీవించి పంపినారు. అక్కడే కొంత నయమైన వ్యాధి వారం దినాల్లో పూర్తిగా తగ్గిపోయింది.

ధాభా గ్రామం వెలివాడలో బాపు అనే చర్మకారుడు కులవృత్తితో జీవిస్తూ ధర్మమార్గమున నడిచేవాడు. అతడు వినయశీలి, భక్తుడు. అగ్రవర్ణాలవారు మాదిగవారిని ముట్టరు. కొండయార్యస్వామి హిపరాకు పోయి తిరిగి వస్తూ మాదిగవాడ చొచ్చి బాపు ఇంటి ముందు నిలిచినారు. బాపు స్వామికి సాష్టాంగపడి మంచంపై కూర్చుండజేసినాడు. ఇంటి చుట్టూ తోళ్లు వేలాడుతూ దుర్గంధం వస్తున్నది. బాపు సిగ్గుపడుతున్నాడు. స్వామి తమకు ఆకలిగా ఉన్నదంటూ అంబలి పోయుమన్నారు. బాపు నయము భయము భక్తి ముప్పిరి గొని స్తంభించిపోయినాడు. స్వామి ఆతని అశక్తతను గుర్తించి తామే గుడిసెలోనికి పోయి అంబలి కుండ తీసుకొనివచ్చి కడుపార త్రాగి బాపును దీవించి తమ మఠానికి వెళ్ళిపోయినారు. కుల మత వర్ణ వివక్షతలు పాటించని మహానుభావుల్లో కొండయార్యులగ్రగణ్యులు. ధాభా వాసి అంబేద శివలింగయ్య వేదాంతవేత్త , వీరశైవా చార సంపన్నుడు. ఆయన అకాలమరణంతో ఆయన బిడ్డలు అన్నమ్మ వీరమ్మలు కొండయార్యులను ఆశ్రయించి మఠంలో ఉంటున్నారు. యుక్తవయస్సు రాగానే వారు స్వామిని తమకు వివాహాలు చేసి పంపిస్తే భారం తగ్గుతుందని ప్రార్థించినారు. స్వామి అన్నమ్మతో నీకు సంసారసుఖం లేదు, మఠంలోనే ఉండి నామస్మరణం గురుసేవలతో కాలం గడుపుమన్నారు. ఆహారంగా బండలు తినుమన్నారు. అందరూ అన్నం తిని బ్రతికితే తాను రాళ్ళెట్లా తినేదని అన్నమ్మ అడిగితే గురువు ఆజ్ఞను పాటించుమన్నారు. అన్నమ్మ ప్రాణహితా నదిలో స్నానం చేసి అక్కడే తెల్లరాళ్ళను మూట కట్టి తెచ్చి గురువు సన్నిధిలో కూర్చుండి శనగలవలె నమిలింది. చూపరులు గురుమహిమకు అన్నమ్మ భక్తికి విస్తుపోయినారు. అన్నమ్మ జీవితమంతా బండరాళ్ళే తిని బ్రతికింది. చివరిదాకా ఆమెకు ఒక్క పల్లైనా కదలలేదు. గురుసేవలోనే కాలం గడిపి అన్నమ్మ శివసాయుజ్యం చెందినది.

అంబేద పెద్దకొండయ్య రెండవకొడుకు చెన్నబసవయ్య కొండయార్యుల భక్తుడు, సిర్పూర్‌మఠానికి దత్తతపోయినాడు. గురుకృపచే సకల విద్యాపారంగతుడు

మహిమాన్వితుడైనాడు. అగ్నిగుండాలు, ప్రభలు నిర్వహించేటప్పుడు పగటి దివిటీలు భేరీ నగారాలు మొదలైన ఆడంబరాలతో పల్లకిలో ఊరేగేవాడు. ఒకసారి అక్కడి విప్రులు ఆతని ఆడంబరాలకు అసూయపడి పల్లకి నుండి లాగి దుర్భాషలాడినారు. చెన్నబసవయ్య గురువును స్మరించినాడు. వెంటనే రెండు పులులు వచ్చి విప్రులపైకి లంఘించినవి. వారు పాదాక్రాంతులై క్షమార్పణ కోరిన తరువాత చెన్నబసవయ్య ఆ పులులను ఈడ్చుకొని తమ మఠానికి వెళ్ళినారు. ఒకసారి సిర్పూర్ ముస్లింలు కూడ పీర్ల పండుగప్పుడు చెన్న బసవయ్యగారి ఊరేగింపును అడ్డగించి దుర్భాషలాడితే తత్క్షణమే వారి కొంపలు తగలబడిపోయినవి. వాళ్ళు క్షమార్పణ చెప్పుకున్నారు. తాలూకా అధికారి చెన్నబసవయ్య సమస్త రాజ లాంఛనాలతో ఊరేగవచ్చునని శాసనం చేసినాడు. ముస్లింలు కపటవర్తనులై చెన్నబసవయ్యను నిజాంను దర్శిస్తే బహుమతులిస్తాడని పురికొల్పినారు. చెన్నబసవయ్య తనకూ తన గురువుకూ ఇదొక పరీక్షగా తలచి నిజాం నవాబును దర్శించినాడు. నిజాం చెన్నబసవయ్యను విందు కాహ్వానించి మాంసాహారం తెప్పించినాడు. చెన్నబసవయ్య మంత్రించిన విభూతి ఆ పదార్థాలపై చల్లినాడు. మాంసాహారములు మధురపదార్థములైనవి. నిజాము చెన్నబసవయ్య మహిమను కొనియాడి సిర్పూర్ తాలూకా లోనవెల్లిలో యాభై ఎకరాల భూమి మఠానికి దానం చేసినాడు. సద్గురువుల మహిమ నిజమైన శిష్యులకు కీర్తిప్రతిష్ఠలతోపాటు సద్గతిని కల్పిస్తుంది కదా!

ఆహిరి సంస్థానాధిపతి ధర్మారావు, దీకొండ రాజయ్య, లింగయ్య, వీరన్న, బ్రహ్మయ్య వంటి సంపన్న భక్తులు కొండయార్యస్వామి మఠానికి గొప్ప ధర్మశాల కట్టించి అన్నదానం చేసినారు. ఆనాడు భక్ష్యాలు వడ్డించినారు. నెయ్యి తక్కువ బడితే స్వామి బిందెడు నీళ్ళు తెప్పించి గుడ్డ కప్పించి మంత్రించి విభూతి చల్లినారు. ఒక్కక్షణంలో బిందెడు నెయ్యి సిద్ధమైనది.

ధర్మారావు ప్రతిసంవత్సరం గురువుగారి మఠానికి అన్నదానం నిమిత్తం 500/- రూపాయలు పంపుతూ గురుధ్యాన తత్పరుడై పుణ్యకార్యాలు చేసి శివసాయుజ్యం పొందినాడు. సద్గురువులు తమను నమ్మిన శిష్యులకు ఊడిగం చేస్తారంటారు. సిర్పూర్ రైల్వే ఉద్యోగి వెంకటరామయ్య కొండయార్యులకు కూర్చు భక్తుడు. అతడు రెండు దినములు సెలవుపెట్టి ధాభాకు వచ్చి నవవిధ భక్తిమార్గముల గురువును అర్చించినాడు. గురుసేవలో తనను తన ఉద్యోగాన్ని మరచి వారము దినము

లుండిపోయినాడు. కొండయార్యులు వెంకటరామయ్య వేషంలో సిర్పూర్ రైల్వే స్టేషన్‌లో విధులు నిర్వర్తించినాడు. వారం దినాల తరువాత ఉద్యోగంలో చేరటానికి పోయిన వెంకటరామయ్య భయభక్తులతో తనపైఅధికారి ముందు నిల్చి తన తప్పిదం మన్నించగోరినాడు. అధికారి ప్రతిదినం రిజిస్టరులో అతని సంతకం చూపించి ఆశ్చర్యం కలిగించినాడు. గురుకృపా పాత్రుడు వెంకటరామయ్య ధన్యుడు.

ఈ విధంగా సద్గురువు, శిష్యవత్సలుడు, సన్మార్గదర్శి ఐన కొండయార్యులు దీర్ఘకాలం బ్రతికి సమాధి కట్టించుకొని దానిపై ఆలయం నిర్మింపజేసి కొద్దిదినాల్లో తాము శివైక్యం చెందే విషయం శిష్యుడు సాంబయ్యకు చెప్పినారు. సాంబయ్య దూరదూరాలకీ వార్తలు పంపినాడు. ధాభా మఠానికి వేలు లక్షల సంఖ్యలో భక్తులు వచ్చినారు. స్వామి తమ శిష్యులకు కొన్ని దినాలదాక జ్ఞాన వైరాగ్యముల గూర్చి బోధించినారు. అభ్యాసయోగంలోని మంత్ర, లయ, హఠ యోగముల గురించి, భక్తి జ్ఞాన యోగముల గురించి విపులంగా వ్యాఖ్యానించినారు. ఒకనాడు జపతపములు భజన కార్యక్రమములు ముగించి వచ్చిన భక్తులందరినీ ఆశీర్వదించి సాంబయ్యతో అంబలి తెప్పించుకొని త్రాగి ధ్యానమగ్నులైనారు. వేల భక్తులు నాడు సంకీర్తనం చేస్తుండగా కొండయార్యస్వామి శివైక్యం చెందినారు. భక్తులు అనాథల వలె కన్నీరు మున్నీరుగా దుఃఖించినారు. మూడు దినాలు స్వామి శరీరానికి స్నానం చేయించి భస్మ గంధాక్షతలతో పూలమాలలతో అలంకరించి షోడశోపచారాలు నెరపినారు. శా.శ.1861 ప్రమాది సంవత్సర కార్తీక శుద్ధ చవితి మంగళవారం 14-11-1939 నాడు అశేష భక్త జనుల మధ్యలో దూరదూరాలనుండి వచ్చిన సాధుసంతుల సమక్షంలో స్వామి దేహాన్ని, ముందుగా వారే కట్టించుకున్న సమాధిలో నిక్షేపించి, ద్వారం మూసివేసినారు. ఆనాడు స్వామి సమాధి కార్యక్రమంలో పాల్గొన్న మరొక మహాత్ముడు సంత్ తుక్డోజి మహారాజు. ఆ మహాత్ముడు భక్తిపారవశ్యంతో నామసంకీర్తనం చేసి దుఃఖసాగరంలో మునిగిన భక్తులందరినీ భక్తినావలో ఎక్కించి దాటించినారు. 105 ఏండ్లు మహామహిమోపేతమైన జీవితం గడిపిన పరమహంస కొండయార్యులు ఆకాశోజ్జ్వల నీలవారిధరమధ్యస్థంగా భాసించే విద్యుత్ప్రభవలె, నీవారశూకాతి సూక్ష్మాకారంలో శంభునిరూపంవలె భక్తులకు ప్రత్యక్షదైవమై, ఆర్తులకు కొంగుబంగారమై పూజలందుకుంటున్నారు.

**ఆధారం :- శ్రీ కొండయార్య స్వాములవారి జీవిత చరిత్రము - శ్రీమతి అలుకాతాయి అశోకరావు బోనగిరి వారి - ధాభా - 28-6-1987.**

# విశ్వగురు సందర్శనం

శ్రీ. జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

*(గత సంచిక తరువాయి)*

విద్యార్థులకూ, సంఘానికీ ఆదర్శంగా ఉండవలసిన వీళ్లే మర్యాదకూ, మన్ననకూ, శీలానికీ, పవిత్రతకూ దూరంగా ఉంటున్నారు. ఇటువంటి పరిస్థితిలో వీళ్ళెట్లా పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పి మంచి సమాజాన్ని నిర్మాణం చేసి మానవతా విలువలు పోషిస్తారు? ఇంతగా తాను నైతికంగా పతనం చెందుతున్నా - గురివింద గింజ లాగా తన స్థితి తాను గమనించకుండా - సంఘాన్ని ఏదో ఉద్ధరించాలని పెద్ద మొనగాడులా బయలుదేరుతున్నాడు. ప్రతిచోట అపజయాన్ని రుచి చూస్తున్నాడు. మతమౌఢ్యం, బడుగుదేశాలపై గుత్తాధిపత్యం చెలాయించాలనే మనస్తత్వం ఒకవైపు, ప్రపంచంలో ప్రబలి అశాంతికి దారితీస్తుంటే, మరొకవైపు మనదేశంలో కులతత్వం విషం గ్రక్కుతూ వ్యక్తుల్ని విడదీస్తున్నది. రాజకీయ నాయకులు జాతిసమైక్యతకు పాటుపడవలసింది పోయి, ఓట్లు దండుకోవడానికి కులతత్వాన్నీ, మతవైషమ్యాన్నీ రెచ్చగొడుతున్నారు. ఎక్కడ చూచినా అశాంతి.ఎవర్ని చూచినా మోసం. ఎక్కడ బడితే అక్కడ ద్వేషం. విజ్ఞానం ఇంతగా అభివృద్ధి చెంది, మానవుడు గ్రహాంతరయానం చెయ్యకలిగిన శక్తి సంపాదించుకొన్నప్పటికీ విశ్వం ఇంత అస్తవ్యస్తంగా, అశాంతి నిలయంగా ఎందుకున్నది ? మేధావులు ఏం చేస్తున్నారు? మనిషికీ మనిషికీ మధ్య గోడలు హిమాలయాల్లా ఎందుకు లేస్తున్నాయి? ఈ భయంకర విపత్కర పరిస్థితికి కారణం ఏమిటి? తక్షణం ఈ ముళ్ళు విప్పి విశ్వమానవాళిని మేల్కొల్పాలి. చైతన్యవంతం చెయ్యాలి. ఈనాడు మానవులకు భగవంతుణ్ణి గురించి చెప్పటం కాదు. ఆచరణశూన్యమైన వేదాంతాలు, నీతులు వల్లించటం కాదు - చేయవలసింది. మానవుల్లో సనాతన ధర్మాచరణ పట్ల ఆసక్తి రేకెత్తించాలి. వ్యక్తుల ప్రవర్తనను సరిచేయాలి. వాళ్లను శీలవంతులుగా, బాధ్యతాయుత వ్యక్తులుగా మారేటట్లు తీర్చిదిద్దాలి. సనాతన ధర్మానికి మూలస్తంభాలైన సత్యం శాంతి పవిత్రత ఐకమత్యాలను విశ్వమానవులలో పెంపొందించి, విశ్వమానవ సమైక్యత ద్వారా విశ్వశాంతిని సాధించాలి.' అనే ధ్యేయంతో, తాము సముపార్జించిన ఆధ్యాత్మికశక్తితో సమాజాన్ని పటిష్ఠం

చెయ్యాలన్న తపనతో శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహాప్రస్థాన భేరీ ఈనాడు మోగిస్తున్నారు.

విశ్వగురువు విశ్వంజీ ప్రబోధంలో ఉపనిషత్ వాక్యాలు వినిపించవు. గీతలోని శ్లోకాలుండవు. అర్థంకాని వ్యర్థపదాడంబరం ఉండదు. అయినా ఆయన మాటలలో సనాతనధర్మం వినిపిస్తుంది. వేదాంతసారం ఇమిడి ఉంటుంది. సమైక్యం వెల్లివిరిస్తుంది. శాంతి పల్లవిస్తుంది. మేధావులను ఆ మాటలు మేల్కొల్పుతాయి. సామాన్య వ్యక్తులకు తమ బాధ్యతను గుర్తుచేస్తాయి. సర్వప్రపంచం ఆ మధుర వేణుగానాన్ని విని ముగ్ధమైపోతుంది. విశ్వయోగి ఆధ్యాత్మికతత్వవేత్త. సంఘసంస్కర్త. "ఆయన దివ్యమానవుడు. విశ్వకారుణ్యమూర్తి. ప్రేమమయుడు" అన్న విషయాన్ని పదేపదే ఆయన ప్రసంగాలు వెల్లడిచేస్తూ ఉంటవి.

ఏ ప్రసంగంలో చూచినా ఆయన చెప్పేది విశ్వసమైక్యత, విశ్వశాంతులను గురించే! ఆయన ఆకాంక్షించేది సనాతన ధర్మ సదాచరణ గురించే! కొంతమంది ఆయన ఉపన్యాసాలను చూచి 'పాడిందే పాడుతున్నా' డనుకోవచ్చు. పదేపదే ఇట్లా పాడకపోతే మానవసమాజంలోని తరతరాల మత్తు వదలదు. అందుకని ఎవరేమి అనుకొన్నా ఆయన తాము పాడాలనుకొన్నది పాడక తప్పదు. "ప్రేమమూర్తులారా!" అంటూ ప్రారంభించి, "అదుపూ పొదుపూ పాటించండి! ఈ సృష్టిలో, అణువణువులో ఏ శక్తి నిండి ఉన్నదో, ఆశక్తే నీలోనూ నిండి ఉన్నది. త్రికరణశుద్ధిలేని హృదయంలో ప్రవేశించే భావాలు కళాయి లేని పాత్రలో వండిన ఆహారపదార్థాల్లాగా విష తుల్యాలౌతాయి. కోర్కెలను చంపుకోండి! మోక్షమెక్కడో ఉన్నదనుకోకండి. మోహక్షయమే మోక్షం! గురువు యెడల మీకు గురి ఉండాలి. గురువుకు కావలసింది పూలదండలూ, పండ్లూ, దక్షిణలూ కాదు. ఆయన చెప్పినట్లు ఆచరించటమే మీరిచ్చే నిజమైన గురుదక్షిణ. మొట్టమొదట నిన్ను నీవు సంస్కరించుకో! ఆ తర్వాత నీ యింటిని సంస్కరించుకో! సంస్కరించబడిన కుటుంబాలతో సమాజం దానంతట అదే బాగుపడుతుంది. వ్యక్తులు ఒకరి కొకరు సహాయపడుతుండాలి. ఒకడు అందరికోసం, అందరూ ప్రతిఒక్కడికోసం కలవాలి! కలసి పనిచేయాలి! అప్పుడే సమాజం ప్రగతి సాధిస్తుంది. అంతా ఒకచోట సమావేశం అయితే సమైక్యత రాదు. మీ మనస్సులు కలపాలి. మీ భావాలు కలపాలి. ఒకరి నొకరు ఆదరంతో, అభిమానంతో ప్రేమించాలి. ఈ విశ్వంలో ఉన్న దొక్కటే కులం. అది మానవకులం. ఉన్నదొక్కటే మతం. అది విశ్వ

(ప్రేమ) మతం. మతాల మార్గాలు వేరైనా అందరి గమ్యం ఒక్కటే! దేవు డొక్కడే! మనమంతా ఒక్కటే! ప్రేమ ద్వారా విశ్వమానవులంతా సమైక్యమై, హింసావాదాన్ని రూపుమాపాలి. విశ్వశాంతిని తేవాలి" అని శ్రీ విశ్వయోగి విశ్వంజీ తమ ప్రసంగాలలో ఉద్ఘాటిస్తారు. ఆయన మాటల్లో బుద్ధభగవానుని అహింస విహరిస్తుంది. క్రీస్తుదేవుని ప్రేమ వెల్లివిరుస్తుంది. వివేకానందుని భారతీయ సామాజిక సంస్కరణం విరాజిల్లుతుంది. బాపూజీ సమైక్యసందేశం వినిపిస్తుంది. విశ్వమానవ కల్యాణం వెలుగులు జల్లుతుంది. "వారిని చూచినప్పుడు ఒక మహర్షిని, ఒక మహాప్రవక్తను, ఒక సిద్ధపురుషుణ్ణి సందర్శించిన అనుభూతి కలుగుతుంది" అని అంటారు డాక్టర్ కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి. ఆ మాటలు అక్షర సత్యాలు. అనుమానం లేదు.

కరుణశ్రీలాగానే చాలామంది ప్రముఖులు శ్రీ విశ్వయోగి విశ్వంజీని గురించిన తమ అమూల్యాభిప్రాయాలను వెల్లడించారు. "దత్తాత్రేయ ఆరాధకులైన మాకు శ్రీవిశ్వయోగి విశ్వంజీ సాక్షాత్తు దత్త స్వరూపంగా అగుపడతారు. అగుపడటమే కాదు... వారు సంపూర్ణదత్తావతారులు. సమాజాన్ని ప్రేమమయం చేసేందుకు, శాంతి సామరస్యాలను పెంపొందించేందుకు ఈ భూమిపై వారు అవతరించారు. విశ్వయోగి విశ్వంజీ రూపంలో దత్తశక్తి ఒక రూపాన్ని దాల్చిందని మా విశ్వాసం" అని అంటారు కుర్తాళం పీఠాధిపతి శ్రీ శివ చిదానంద భారతీ స్వాములవారు. "స్వామీజీ ప్రబోధం, ఆలోచనలు మానవత్వపు విలువలను పరిరక్షించే విధంగా, అందరికీ ఆమోదయోగ్యంగా ఉన్నవి. వారి ప్రబోధమును అర్థం జేసుకొని, ఆచరణలో పెడితే, విశ్వశాంతి, విశ్వకల్యాణం సుగమమౌతాయి" అని అంటారు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు. "విశ్వయోగి విశ్వంజీ ఒక యోగిరాజ్" అంటారు డాక్టర్ కరన్‌సింగ్. "విశ్వయోగి విశ్వంజీ సాక్షాత్తు భగవంతుడు. దత్తాత్రేయులవారి అవతారం" అంటారు మహర్షి బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు. "విశ్వంజీగారు ఎవరో కాదు. ..షిర్డీ సాయినాథుడే!" అంటుంది మాతృశ్రీ పూలమ్మ. "మానవతా విలువల కోసం ఇంతగా ఆరాటపడుతున్న విశ్వయోగిలాంటి క్యాప్టెన్ మరొక్కడు మరెక్కడా మనకు కనిపించడు. ఆయన శుభాశీస్సులతో విశ్వకల్యాణం జరగాలి" అంటారు గౌరవనీయులు శ్రీ రంగనాథ మిశ్రా. "ధర్మం కుంటికాలుతో నడిచే ఈ కలియుగంలో జితేంద్రియులు, అతీతులగు, దైవాంశ సంభూతులనబడు మాణిక్యప్రభు, శ్రీపాదవల్లభులు, షిర్డీ సాయిబాబా, శ్రీ సత్యసాయిబాబా మున్నగువారి కోవలోని అపరదత్తమూర్తి శ్రీశ్రీశ్రీ విశ్వయోగి

విశ్వంజీగారు" అని అంటారు శ్రీ పి.వి. నరసింహారావు. "శ్రీస్వామి వారు శాంతి ధర్మ సంస్థాపనార్థం ఉద్భవించిన అవతారమూర్తులు" అంటుంది సోదరి డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి. "ఆత్మసాక్షాత్కారం పొంది దైవత్వాన్ని సిద్ధింపజేసుకొన్న మహాయోగి శ్రీ విశ్వయోగి విశ్వంజీ" అంటుంది శ్రీమతి వై.అరుణాదేవి. "వ్యక్తిగతముగాగాని, దేవపరముగాగాని, కులమతదేశ అవధులకు పరిమితం గాకుండా, సర్వమానవ సౌభ్రాతృత్వాన్నీ పెంపొందించుటకు నిరవధికముగా కృషిచేయుచున్న మానవ రూపదైవము శ్రీవిశ్వంజీగారు" అని అంటారు శ్రీ చిట్టూరు త్రివిక్రమరావు.

"మా విశ్వయోగి బాల్యము నుండియే వైరాగ్యము నభ్యసించి, ఉపాసనచే, యోగాభ్యాసముచే దత్తస్వరూపుడయ్యెను. మా విశ్వం విశ్వంభరుడే! విశ్వేశ్వరుడే! విశ్వయోగితత్వము అతి విశాలమైనది. అతడు తాను సర్వవ్యాపకుడై సమస్త మతములను, సమస్త మానవకోటిని - అంతేకాదు - సమస్త జీవకోటిని తన స్వరూపముగా చేసుకొనెను. సర్వమానవ శ్రేయస్సే వారి లక్ష్యము. దత్తావతారుడగు మా విశ్వయోగి యొక్క విశ్వవ్యాప్తిని త్వరలోనే మీరు చూడగలరు." అని అంటారు శ్రీరామశరణ్ కుందుర్తి వెంకట నరసయ్యగారు. ఇట్లా అనేకమంది పీఠాధిపతులు, మేధావులు, ప్రముఖులు శ్రీ విశ్వయోగి విశ్వంజీ విశ్వరూపాన్ని దర్శించి, ఉప్పొంగిపోయి, తమ ఆనందాన్ని వాగ్రూపంగా వెల్లడించారు. శ్రీ విశ్వంజీకి ఆనాడు జడ్చర్లలో మంత్రప్రదానం చేసిన గురుదేవులు - ఇప్పటికి ముప్ఫైయేళ్ల క్రిందటే - విశ్వంజీని వీక్షించిన మరుక్షణమే ఆనందం పట్టలేక "ఈవిశ్వంభరుడు కారణజన్ముడు. భవిష్యత్తులో విశ్వమానవకల్యాణం ఇతనివల్ల జరుగుతుంది. ఇది మామూలు మణిగాదు. అనర్ఘ మణి" అని ఆశీఃపూర్వకంగా ప్రశంసించారు.

ఇందరు ఇన్నివిధాలుగా ప్రశంసించినా - నిత్యం ఆయన లీలలు చూస్తున్నా మాయలో పడి వారి నిజతత్వాన్ని మనం గుర్తించలేకపోతున్నాం. ఆయన అడుగుజాడల్లో నడవలేకపోతున్నాం. మన భావనలకు, ఆలోచనలకు తగినవిధంగానే ఆచరిస్తూ అదే భక్తి అని మురిసిపోతున్నాం. ఆ భక్తి చాలదు. మరింతగా ఆయన్ను మనం అర్థం చేసుకొని ఆయనకు చేరువ కావాలి. విభిన్న వర్గాలలోని మేధావులను ప్రేమతో, ఆప్యాయంగా చేరదీసి, సంఘటిత పరచి, వారి జ్ఞాపకశక్తిని విశ్వమానవ సౌభాగ్యంకోసం వినియోగపడేటట్లు చేయాలన్నదే శ్రీ విశ్వంజీ లక్ష్యం. కులాల మతాల పేరుతో

పరస్పరం దూరమౌతున్న వ్యక్తులను ఆధ్యాత్మిక శక్తి ద్వారా సంఘటితపరచి, ఏకమనస్కులుగా తీర్చిదిద్ది, తద్వారా సమాజ వికాసాన్ని సాధించాలన్నదే ఆయన ధ్యేయం. ప్రతివ్యక్తిని శక్తికేంద్రంగా రూపొందించాలన్నదే ఆయన తపస్సు. ప్రతివ్యక్తిలో ఐక్యత (త్రికరణశుద్ధి) క్రమశిక్షణ, ఆత్మవిశ్వాసం, ఆత్మనిగ్రహం, ఆత్మానందం, ఆత్మసాక్షాత్కారం కలిగించాలన్నదే వారి ఉద్బోధ. "నీవు ఎవరు" అని అడిగితే "నేను మనిషి!" నని సగర్వంగా ప్రతివాడు చెప్పుకొనే రోజుకోసమే వారి నిరీక్ష. విశ్వమానవ సమైక్యత కోసం, విశ్వశాంతి స్థాపనకోసం అవతరించిన దివ్యమానవుడు, సనాతనధర్మానికి మర్మస్థానాలైన శాంతి, శీలము, పవిత్రత, ఐక్యతల పునాదులతో నవసమాజ నిర్మాణ సౌధాన్ని నిర్మించబోతున్న దివ్యశిల్పి శ్రీవిశ్వయోగి విశ్వంజీ.

"నామార్గం ఏ గురువుకూ, ఏ భగవంతుడికీ, ఏ మతానికీ, ఏ కులానికీ వ్యతిరేకమైంది కాదు. మనిషిలో నేడు మృగ్యమౌతున్న మానవతావిలువలు పెంచి, దౌష్ట్యాన్ని త్రుంచి, వ్యక్తిని సంస్కరించి, తద్వారా కుటుంబాన్ని దిద్దితీర్చి, సమాజాన్ని సమైక్యపథంలో నడిపిస్తూ, ఆధ్యాత్మికతద్వారా మానవుణ్ణి సంపూర్ణ మానవుడిగా, దివ్యమానవుడుగా మార్చాలన్నదే నేను నిత్యం చేస్తున్న జపం" అని చెబుతున్న ఆ విశ్వగురువు వంటి సద్గురువు మరొకడు మనకు లభించడు. ఆత్మసాక్షాత్కారం పొందిన తరువాత, ఆ స్థాయిలో క్రిందికి దిగి, సామాన్య మానవులతో కలసిమెలసి మెలగుతూ, మానవకల్యాణం కోసం, మనిషి మనుగడ కోసం, విశ్వశాంతి కోసం ఇంతగా అలమటించే వ్యక్తులు, అహర్నిశం ఇంతగా పాటుబడే వ్యక్తులు - ఏ సాయిబాబాగారి వంటివారో తప్ప - మరెవ్వరూ మనకు కనిపించరు. మన పూర్వపుణ్య విశేషం వల్ల, పరమ గురువుల అపారదయావృష్టి వల్ల అటువంటి సద్గురువు ఈ జనారణ్యంలో మనకు లభించినందుకు మనం పొంగిపోవలసి ఉంది. ఆ విశ్వ గురువు బోధలు కూలంకషంగా అర్థం చేసుకొని ఆచరణలో పెట్టవలసిన అవసరం ఈ నాడెంతో ఉన్నది. ఆ పెన్నిధిని నిరాకరిస్తే అంతకన్నా దురదృష్టం లోకానికి మరొకటుండదు. ఆ విశ్వగురువును మార్గదర్శిగాగైకొని, మతసామరస్యానికీ, విశ్వశాంతికీ పాటుబడటం విశ్వమానవాళి ప్రధాన కర్తవ్యమని విన్నవిస్తున్నాను. విశ్వనగర్ - విశ్వగురుపీఠంలో వీరు నెలకొల్పిన విశ్వసమైక్యతా స్థూపం విశ్వమానవాళిని జాగృతం చేసి సమైక్యం చేయగలదని ఆశిద్దాం. *(అయిపోయింది)*

# ఆర్తిహరా !

డా. జంధ్యాల జయకృష్ణ బాపూజీ

ఆర్తిహరా స్ఫూర్తికరా
అభయము నీయవయా
యోగావరా విశ్వవరా
ముక్తుల జేయుమయా మము
ముక్తుల జేయుమయా ॥ఆర్తి॥

శుభకరమౌ నీ చరణం
శరణము మాకయ్యా
కులమలినం మతతిమిరం
మాయం చేయుమయా మటు
మాయం చేయుమయా ॥ఆర్తి॥

మదినిండా పొదలయ్యా
ఛేదన చేయుమయా
బ్రతుకంతా వెతలయ్యా
శాంతిని నింపవయా సుఖ
శాంతిని నింపవయా ॥ఆర్తి॥

నిను నిరతం వదలమయా
నీడగ నిలువుమయా
మా భారం నీదయ్యా
మౌనం వీడుమయా ఈ
మౌనం వీడుమయా ॥ఆర్తి॥

# శ్రీ వల్లభ చరితామృతం

హిందీమూలం :
శ్రీకళాధరభట్

తెలుగు :
డా. తిరుమలరామచంద్ర

(కిందటి సంచిక తరువాయి)

ఆత్మస్వరూపుడైన వైశ్వానరుడెవడనే జిజ్ఞాసతో శిష్యుడు ఆచార్యున్ని " ఈ వైశ్వానరుడెవడో మాకు తెలపండి" అని ప్రశ్నించాడు. (ఆత్మానమేవేనం సంప్రత్యధ్యేషి - తమేవనోబ్రూహి) దానికి ఆచార్యుడు "ఈ వైశ్వానరుడు అంగుష్ఠం ఎంత ఉందో అంత మాత్రమే ఉంటాడు. అంతేకాక సకల పరిమాణాన్ని మించి సర్వవ్యాపకుడు" అని సమాధానం చెప్పాడు. అంటే ప్రాదేశమాత్రత్వం (ఒకచోటే పరిమితంగా వుండడం) సర్వవ్యాపకత్వం అనే పరస్పర విరుద్ధ ధర్మాలున్న ఈ 'వైశ్వానరుడే' పరమాత్మ 'యస్త్వేతమేవం ప్రదేశ మాత్ర మభి విమాన మాత్మానం వైశ్వానరమ్ ఉపాస్తే'. ఎందుకనగా పరస్పర విరోధం పరబ్రహ్మలోనే సంభవిస్తుంది. - 'పరస్పర విరుద్ధతా బ్రహ్మణ్యేవ సంభవతి' - విద్వన్మండలమ్. అగ్నికున్న ఈ 'వైశ్వానర' పర్యాయపదం 'పరమాత్మ'కు నిర్దేశకమని దీనివల్ల స్పష్టమైంది. వల్లభులు సాక్షాత్పూర్ణపురుషోత్తముడని భావించడానికి కారణం - మొదటిది వారు తమను స్వయంగా వైశ్వానరుడని చెప్పుకున్నారు. రెండవది - వారే సాక్షాద్భగవంతుని ముఖమని అందరూ అంగీకరించారు. మూడవది - పుష్టిమార్గానికి ప్రథమ ప్రవర్తకులు వారే - 'ఆదౌ పుష్టి మార్గ ప్రవర్తనాయ స్వయం భగవానవతీర్ణః' - సుబోధిని.

స్వయంగా భగవంతుడే భాగవతంలోని నిగూఢతత్త్వాన్ని అందరికీ తెలియజేయడానికి 'మానవదేహం' ధరించి భూమి మీద అవతరించమని శ్రీ మద్వల్లభాచార్యులను ఆదేశించాడు. అనర్థాలను తొలగించడం శ్రీ కృష్ణభగవానుని భక్తి ద్వారానే సాధ్య మవుతుంది. ఈ శుభ సందేశంతో వల్లభులు అవతరించారు. అవతరించే దశలో వల్లభులకు స్వయంగా భగవంతునితో పెక్కు సార్లు సమావేశం జరిగివుంటుంది. కాని ఈలాటి సమావేశాలలో ఒకదానిని మాత్రమే వల్లభులు

ప్రస్తావించారు. ఈ సమావేశం శ్రావణశుద్ధైకాదశి నాడు అర్ధరాత్రి జరిగింది. ఇదొక పవిత్రమైనదినం. ఈనాడు భగవంతుడు స్వయంగా వల్లభులను జీవులకు బ్రహ్మతో సంబంధం కలిగించమని ఆదేశించాడు. వల్లభులు ఈ సంఘటనను జరిగినది జరిగినట్లు తమ 'సిద్ధాంత రహస్య' మనే గ్రంథంలో వర్ణించారు. "శ్రావణ స్యామలే పక్షే ఏకాదశ్యామ్ మహానిశి, సాక్షాద్భగవతాప్రోక్తం తదక్షరశ ఉచ్యతే". ఈ సంఘటనతో పుష్టి సంప్రదాయం వాస్తవంగా నిరంతరం మంగలమయంగానూ, పాపరహితంగానూ, రసమయంగాను విరాజిల్లుతుంది. ఇది ఒక నితాంత సత్యమైన సంఘటన. దీనిని ఈ మహానుభావులు మానవమాత్రులను అనుగ్రహించడం కోసం అక్షరబద్ధం చేశారు. అవతారవాదాన్ని విశ్వసింపని నాస్తిక సమాజానికి వల్లభుల ఈ నిర్భయమైన ఆత్మవృత్తాంతం ఒక రహస్యాన్ని ఉద్ఘాటించే అచంచలమైన స్పష్టమైన సవాలు. వల్లభులకు తమ అవతరణదశలో భగవంతునితో సాక్షాత్సంబంధం ఉండనే ఉండినది. భగవంతుని నుంచి వారికి ఈ ఈ పనులు చేయమని విశిష్టమైన ఆదేశాలు కూడ అందుతూ ఉండేవి. దీనిని వల్లభులు తమ 'అంతఃకరణ ప్రవేశ' మనే గ్రంథంలో ఉల్లేఖించారు. వల్లభుల రూపరేఖలను గురించి వారి పుత్రులు శ్రీ విఠ్ఠలేశ్వరులు "వస్తుతః కృష్ణ ఏవ" అని చెప్పినది వస్తుతః సత్యమనే తోస్తుంది. సామాన్యంగా సభ్యత గల ప్రతి పుత్రునికి తన తండ్రి విషయంలో ప్రాయశః భగవద్భావం వుంటుంది. ఆ విధంగానే ప్రతి శిష్యుడూ తన గురువును నారాయణుడని అనుకుంటాడు. కాని ఆ తండ్రిగాని, గురువుగాని నిజానికి నారాయణుడుగాని, భగవంతుడుగాని కాడు. కాని ఇక్కడనైతే నిజంగా కృష్ణుణ్నే "వస్తుతః కృష్ణః" అని చెప్పడం జరిగింది.

ఈ విధంగా స్వయంగా వల్లభుల వాక్కును బట్టి, పుష్టిమార్గపు దృక్పథంతోను వల్లభులు కృష్ణ సంబంధం గల అలౌకిక తత్త్వ మని నిరూపితమవుతున్నది. 'సాక్షాద్భగవతాప్రోక్తమ్' అనే వల్లభుల వాక్కు వాస్తవంగా లోకోత్తరమైంది; ఎందుకనగా, ఒక చారిత్రక మహాపురుషుడు 'భగవంతుని సాక్షాత్కారం' పొందే విషయంలో చేసిన ఏకైకమైన మొదటి కథనం ఇదే. శ్రీ మద్వల్లభాచార్యులే తమ పుత్రుడు శ్రీ విఠ్ఠలేశ్వరుని రూపంలో మరల అవతరించారు.

గృహస్థాశ్రమంలో ప్రవేశించి వంశాన్ని విస్తరింపజేయడం ద్వారా స్వప్రవర్తితమైన సేవామార్గ ప్రచార ప్రసారాలు చేయమని స్వయంగా పండరినాథుడైన విఠ్ఠలుడు

వల్లభులను ఆదేశించాడని పుష్టిసంప్రదాయపు 'నిజీవార్తా' అనే గ్రంథం నుంచి తెలుస్తున్నది. 'ఫేరిజిత్ పంథరపుర ఆయె విఠ్ఠల్‌నాథ్ కహీ మనభాయే, కం వివాహ బహురూప దిఖాఓ మేరోనామ సువన్ కో ధరా ఓ'. ఆ ఆజ్ఞానుసారం వల్లభులు గృహస్థ ధర్మం స్వీకరించారు. స్వయంగా విఠ్ఠలేశ్వరుడే విఠ్ఠలేశ్వర రూపంలో కుమారుడై అవతరించాడు. ఇది సాంప్రదాయానికి సంబంధించిన నమ్మకం, భక్తుల శ్రద్ధాసక్తులకు సంబంధించిందీని. నమ్మకాలకు, భావనలకు ఆదరం తప్పక ఉండాలి. విశ్వాసం ప్రమాణం కాదుగాని, సంప్రదాయంలో ప్రచారంలో గౌరవాదరాలకు ఇలాంటివి తప్పక కారణాలవుతాయి. శ్రీ మద్వల్లభాచార్యులవారు స్వయంగా తమ పుత్రులుగా అవతరించారనే సంప్రదాయ విశ్వాసం శ్రుతివల్లను, వల్లభుల వాక్కు వల్లను ధ్రువపడుతున్నది. శ్రుతి, వల్లభుల వాక్కు 'స్వతః' ప్రమాణాలు. వల్లభులు 'ఆప్త' ప్రమాణాన్నే ప్రమాణకోటిలో పరిగణించారు. శ్రుతిని అనుసరించి తండ్రే కుమారుడుగా జన్మిస్తాడు. తండ్రే కుమారుడుగా జన్మిస్తాడనే వాక్యాన్ని ధ్రువపరచడానికి వల్లభులు భాగవతంపై తమ వ్యాఖ్య సుబోధినిలో (ప్రథమ స్కంధం, సప్తమాధ్యాయం, శ్లోకం 45) 'ఆత్మావై పుత్ర నామాసి' అనే వేద వాక్యాన్ని ఉదాహరించారు. ఈ సందర్భంలోనే వారు 'పుత్రరూపేణ భర్తా జీవతీతి పుత్రవతీనాం నసహగమనమ్' - పుత్రరూపంలో పతి జీవించి ఉన్నాడనే కారణంగా పుత్రులు గల మహిళ సహగమనం చేయనక్కరలేదు అని స్పష్టంగా చెప్పారు.

పుష్టిమార్గ సంస్థాపకులు, ప్రవర్తకులు వల్లభులే అని పుష్టి మార్గాన్ని లోతుగా అధ్యయనం చేయడంవల్ల తెలుస్తున్నది. 'సమార్గో భగవతా ఏవ సంస్థాప్యతే', 'పుష్టి మార్గ ప్రవర్తనాయ' - ఇత్యాది వాక్యాలు. ఈ సంప్రదాయ ప్రచార ప్రసారాలను వారి కుమారుడు శ్రీ విఠ్ఠలేశ్వరుడు చేశాడు. 'పుష్టి మార్గ స్థాపనా రూపకార్యంలో ప్రచార కార్యంలో చురుకుగా ఉండడానికి వల్లభులు స్వయంగా విఠ్ఠలేశ్వర స్వరూపంలో అవతరించారు. వల్లభులు పూర్తిచేయక వదలిపోయిన పనులను విఠ్ఠలేశ్వరుడు పూర్తిచేశాడు. బ్రహ్మసూత్రాలపై వల్లభులు పూర్తిచేయకుండా వదలిన అణుభాష్యాన్ని విఠ్ఠలేశ్వరుడు పూర్తిచేశాడు. వల్లభుల సూత్రప్రాయమైన వాక్కులను అతడే స్పష్టం చేశాడు. వల్లభులు 'వాక్పతి'. విఠ్ఠలేశ్వరుడు లేకపోతే వల్లభుల వాక్కుల అలౌకిక సౌందర్యం విద్వాంసులు కోల్పోయేవారు. శ్రీ మద్వల్లభాచార్యులు ఉపదేశించిన

సేవామార్గ పద్ధతులు ప్రచార విస్తారాలు కూడ విఠ్ఠలేశ్వరుని ద్వారానే జరిగాయి. ఈ దృష్టితో చూచినప్పుడు తమ పూజ్యపితృపాదుల పేరును గురించి విఠ్ఠలేశ్వరుడు చేసిన నిర్వచనం ఎంత మర్మ గర్భంగా వుంది! భువి భక్తి ప్రచారైక కృతే స్వాన్వయకృత్ అనగా భూతలం మీద భక్తిప్రచారం కోసమే తమ వంశాన్ని సృష్టించేవారు. అంటే, "తమ పుత్రపౌత్రాది వంశజుల రూపంలో మరల మరః అవతరించేవారు."

బ్రహ్మసూత్ర భాష్యకారుడుగా విఠ్ఠలేశ్వరుడు స్వయంగా ఆచార్యుడు. వల్లభుల సంపూర్ణ వాఙ్మయంపై విఠ్ఠలేశ్వరుడు ఉత్తమోత్తమమైన వివృతులు, లేఖలు, వ్యాఖ్యలు మొదలయినవి రచించాడు. ఇంతేకాక విద్వన్మండనం వంటి లోకోత్తర ప్రతిభా సమన్వితమైన, మౌలికమైన గ్రంథాలు ఆయన రచించాడు. వీటిని పరిశీలించడం వల్ల శ్రీ మత్ప్రభుచరణులు వస్తుతః 'వాక్పతి' శ్రీ మద్వల్లభాచార్యులే అనడం స్పష్టమౌతుంది. 'ఆత్మావై పుత్రనామాసి' తండ్రే కుమారుడు అనే శ్రుతి మంత్రం, 'పుత్ర రూపేణ భర్తా జీవతి' పుత్రరూపంలో పతి బ్రతికే వుంటాడు అనే వల్లభుల వాక్కు. 'భువి భక్తి ప్రచారైక కృతే స్వాన్వయకృత్ పితా' భూమి మీద భక్తి ప్రచారం కోసమే తమ వంశాన్ని వృద్ధిపరచేవారు అనే సర్వోత్తమస్తోత్ర వాక్యం - ఈ అన్నింటి స్పష్టీకరణ చౌరాసీ వైష్ణవకీ వార్తా అనే గ్రంథంలో ఈ విధంగా లభిస్తుంది. "అప్పుడు ఆచార్య మహాప్రభువు దామోదరదాసుతో 'నీవు నన్ను ఏవిధంగా భావిస్తున్నావో ఆ విధంగానే వీరి (విఠ్ఠలేశ్వరుని) స్వరూపాన్ని భావించు' అన్నారు."

## 'అష్టఛాప్' కవుల దృష్టిలో వల్లభులు, విఠ్ఠలేశ్వరులు :

ఈ సంప్రదాయపు సుప్రసిద్ధ 'అష్టఛాప్' మండలిలోని మొదటి నలుగురు కవులు శ్రీ మద్వల్లభాచార్యుల, తక్కిన నలుగురు శ్రీ విఠ్ఠలేశ్వరుల పరమసేవకులు. పుష్టిసంప్రదాయపు ఐదుమూల తత్త్వాలలో 'అష్టఛాప్' కూడా ఒకరు. శ్రీనాథ్, శ్రీవిఠ్ఠలేశ్వరుల లాగ ఈ అష్టఛాప్ కవులను కూడ లోకాతీతులుగా భావిస్తారు. వ్రజ భాషకు సాక్షాత్ప్రాణమైన ఈ ఎనిమిదిమంది మహాత్ములు భారతదేశపు భావసమైక్యానికి సజీవ ప్రతీకలు. శ్రీ మద్వల్లభాచార్యులు ఉపదేశించిన స్నేహాత్మక సేవా మార్గంలో పరమోజ్జ్వలమైన ఆకాశ దీపాల వంటి ఈ ఎనిమిది మంది సఖులు లోకోత్తరమైన కావ్యశక్తి సమన్వితులుగను, సంగీత కళకు సాక్షాదధిష్ఠాన దేవతలుగాను విరాజిల్లినారు. వీరు తమ వీణాభినందిత స్వ మాధుర్యంతో భగవంతుని సంపూర్ణ లీలలను ప్రత్యక్షంగాను, పరమరసమయంగాను కీర్తించారు. ఈ కవికాలంలో ఆచార్యులైన వల్లభుల శ్రీచరణాలు

తప్ప ఫలసిద్ధికి మరొక సాధనం లేదని వల్లభుల అనన్య సేవకుడైన మహాకవి శ్రీ సూరదాస్ అంటున్నారు. శ్రీనాథుని, ఆచార్యుణ్ని భేదభావంతో చూడడం ఈ కృపామార్గంలో ఫలసిద్ధికి బాధకమవుతుంది. 'భరసో దృఢ ఇన్ చరణతేరో, శ్రీవల్లభ నఖ చంద్ర ఛటా బిను సబ్ జగ్ మంఖు అంధేరో, సాధన ఓర్ నహీ యా కలియే జాసోహోఇ నిబేరో, సూరదాస కహ ద్వివిధ ఆంధరోబినా మోలకో చేరో." (ఈ చరణాల మీదే నాకు దృఢమైన విశ్వాసం ఉంది. శ్రీవల్లభుని పాదనఖ చంద్రకాంతి లేకపోతే సకల జగత్తు అంధకార మయమౌతుంది. ఈ కలియుగంలో నిర్భరుడు కాగల సాధనం మరొకటి లేదు) సూరదాసు మహాదీనతా పూర్వకంగా శ్రీవల్లభాచార్యులను శరణు వేడుతు ఇలా అంటాడు "శ్రీవల్లభ! అబకీ బేర్ ఉబారో సబ పతితనమే విఖ్యాత పతితహోం, పావననామ తిహారో. 'సూర' అధమకో కహుం ఠౌర్ నహీం బిన ఇక సరన తిహారో" (ఓ శ్రీ వల్లభ! ఈ మారు నన్ను ఉద్ధరించు. నేను సకల పతితులలోను విఖ్యాతుడైన పతితుణ్ని. నీ నామము పావనమైంది. సూరుడనే ఈ అధమునికి ఎక్కడా దిక్కు లేదు. - నీ శరణు ఒకటి తప్ప.) ఒక పరమ అనుభావం (అనుభూతి) గల మహాకవి వల్లభుల సన్నిధిలో కుమ్మరిస్తున్న ఆవేదన ఇది.

మహాకవి పరమానందదాస్ వల్లభుల స్వరూపం విషయంలో చెప్పినది కూడ తెలుసుకోడానికి యోగ్యమైనది. ఆయన ఇలా అన్నారు - "ఔర మోకో శ్రీ ఆచార్యజీ ఆపుకృపాకరకే శ్రీ కృష్ణజీకే స్వరూప సో దర్శన దియోహై, పరమానందదాస్‌కో ఠాకుర్ జే వల్లభ తేశ్యామ" (ఆచార్యులవారు మీరు దయతలచి నాకు కృష్ణుని స్వరూప దర్శనం చేయించారు. పరమానందదాసునికి వల్లభుడే కృష్ణుడు.) 'వల్లభు'డు, 'శ్యాముడు' ఒక్కరే, భిన్నులు కారు. మహాకవి కృష్ణదాసు వాక్కుకూడ ఆచార్యులద్వారా, వారి ప్రభువు శరణును యాచిస్తూ, తాను కృతార్థ అయినట్టు భావిస్తున్నది. 'తబతే శ్యామ సరన హో పాయో, జబ్‌తే భేంట భ ఈ శ్రీ వల్లభ నిజపతి నామసునాయో' (ఓ శ్యామసుందరుడా, శ్రీ వల్లభాచార్యులు ఎప్పుడు తన ప్రభువు పేరు వినిపించారో అప్పటినుంచి నీ శరణు పొందాను.)

*(సశేషం)*



# మాస్టర్ మహాశయులు - మహేంద్రనాథ్‌గుప్తా

- అక్కిరాజు రమాపతిరావు

## జననం 1854 జూలై 14

యుగావతారుడైన శ్రీరామకృష్ణ పరమహంస దివ్యచరిత్రం వంగరాష్ట్రపు ఎల్లలు దాటి ప్రపంచ వ్యాప్తంగా ప్రసరించటానికి, లోకాన్నంతా దివ్యభావతరంగితం చేయటానికి మాస్టర్ మహాశయులు రచించిన శ్రీ రామకృష్ణ కథామృతమే కారణం. శ్రీ రామకృష్ణుల దివ్యచరిత్రకాయన ప్రత్యక్షసాక్షి. ఆయన ఆరాధ్య ప్రేక్షకుడు. నాలుగు సంవత్సరాలపాటు దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణుల గోష్ఠీ ప్రసంగాలను, ఆయన శిష్యుల ఆధ్యాత్మిక వారసుల, సందర్శకుల అనుభూతులను, ప్రశ్నలను, సాధనలను, శ్రీరామకృష్ణ దివ్యానుగ్రహస్ఫూర్తుల హృదయ స్పందనలను, వాగర్చనలను దినచర్యరూపంగా భద్రపరిచిన ధన్యచరితులు శ్రీ మాస్టర్ మహాశయులు. శ్రీ మాస్టరు మహాశయుల అసలు పేరు శ్రీ మహేంద్రనాథగుప్త. ఆయన జన్మాంతర సుకృతం వల్ల శ్రీ రామకృష్ణుల సన్నిధి ఆయనకు సంప్రాప్తమైంది. శ్రీ రామకృష్ణుల దివ్యానుగ్రహానికి విశేషపాత్రులైన అదృష్టవంతుల పరమాదృష్టాన్ని అంతా శ్రీ రామకృష్ణ కథామృతం పేర శ్రీ మహేంద్రనాథగుప్తా తూ.చ. తప్పకుండా శ్రీ రామకృష్ణ కథామృతం పేరు రాసిపెట్టారు. ఒకవేళ ఏరోజైనా ఘట్టంలోనైనా భగవానుల సన్నిధిలో సమక్షంలో తాను లేకపోయినప్పుడు అప్పుడు అక్కడ ఉన్న ఆర్తుల, జిజ్ఞాసుల, ప్రపన్నుల అనుభూతులను, ప్రశ్నలను, ప్రణతార్తిహరుడైన పరమహంస హాస్యాలను, స్వాంతనలను, బుజ్జగింపులను, వేళాకోళాలను, కథలను, దృష్టాంతాలను, నిదర్శనలను, మహిమానుభావాన్ని వారినడిగి తెలుసుకొని శ్రీ మహేంద్రనాథులు భగవానుల దినచర్య వృత్తాంతంగా నిబంధించారు. దాన్ని మొదట పూర్తిగా బెంగాలీలో రాసి కొంతభాగం వారే ఇంగ్లీషులోకి అనువదించారు. దీనిని నాలుగు భాగాలలో కూర్చారు మాస్టరు మహాశయులు. నాలుగోభాగం మాస్టరు గారి స్వర్గతి తర్వాతనే వెలువడింది. తర్వాత శ్రీ రామకృష్ణ మఠం మహాస్వాములు ఈ కథామృతాన్ని లోకానికి అన్ని భాషలలోను ప్రసాదించారు. ఈ కథామృతం ద్వారానే ప్రపంచ ప్రఖ్యాత రచయితలు రోమారోలా, మాక్సముల్లర్ మొదలైన మహనీయులు శ్రీ రామకృష్ణుల దివ్యావతారతత్త్వాన్ని సకలలోక విశ్రుతం చేశారు. ప్రపంచ పరమ నాగరిక భాషలన్నిటిలోనూ శ్రీ రామకృష్ణుల దివ్యావతారతత్త్వం వెల్లడి అయింది. ఇంగ్లీషులో, ఫ్రెంచిలో శ్రీ రామకృష్ణుల దివ్యచరిత్రలు వచ్చాయి.

ఒక స్వామి వివేకానంద అయితే శ్రీ రామకృష్ణ దివ్యామృతం మొదటిభాగం వెలువడగానే ఉప్పొంగిపోయినాడు. పరమశివుణ్ణి చూసిన నంది నర్తించినట్లు

నర్తించారు ఆయన.

శ్రీ రామకృష్ణుల అవతార సమాప్తి తర్వాతనే మాస్టరు మహాశయుల వారి ఈ శ్రీ రామకృష్ణ కథామృతం వెలువడింది.

1989 ఫిబ్రవరి 7వ తేదీన వంగ రాష్ట్రంలో మకాంలో ఉన్న ఒక చిన్న ఊరి నుంచి స్వామి వివేకానంద మాస్టరు మహాశయులు పంపించిన శ్రీ రామకృష్ణ కథామృతాన్ని అందుకుంటూ మాస్టరు గారి కిట్లా రాశారు.

ప్రియమైన ఎమ్.

లక్షసార్లు ధన్యవాదాలు, మాస్టరుగారూ మీరు రామకృష్ణుణ్ణి పూర్తిగా ఆవిష్కరించగలిగారు. అయ్యో, ఆయన కొద్దిమందికి చాలా కొద్దిమందికిమాత్రమే

నా హృదయం ఆనందోత్తుంగ తరంగితంగా ఉంది. అంతేకాదు. ఇలా తలంలో ఇకముందు శాంతి వృష్టిని కురిపించే ఆదివ్య తత్త్వభూమిక దృఢం గావించిన ఆ మూర్తిని చూచిన తర్వాత కూడా నేను ఉన్మత్తుడ్ని కాకపోవడం అత్యంతాశ్చర్యకరం కదా! (హుగ్లీ జిల్లాలోని అనంతపూర్ శ్రీ రామకృష్ణులశిష్యుడైన స్వామి ప్రేమానంద జన్మస్థలి. అక్కడి నుంచి స్వామి వివేకానంద మాస్టరు మహాశయులకు ఈ లేఖ వ్రాశారు).

శ్రీరామకృష్ణ కథామృతమే.ఇంగ్లీషులో 'ది గాస్పెల్ ఆఫ్ శ్రీ రామకృష్ణ' అనే పేరుతో లోకవిఖ్యాతమైంది. తెలుగులో అత్యద్భుతంగా అనువాదమైంది. ఇది శ్రీ రామకృష్ణ మఠ గ్రంథాల విక్రయ కేంద్రాలన్నిటా లభ్యమవుతుంది. ఇక మహేంద్రనాథగుప్త శ్రీమంతమైన జీవితం తెలుసుకుందాం. క్రీ.శ. 1854 జులై 14వ తేదీ నాగపంచమినాడు కల్కత్తా నగరంలోని సిములియాపేటలో మహేంద్రనాథ్ గుప్తా జన్మించాడు. తండ్రి మధుసూదనగుప్తా, తల్లి స్వర్ణమయీదేవి. శ్రీ రామకృష్ణులకు మధుసూదనుడు గొప్పభక్తుడన్న విషయం తెలుసు. మహేంద్రుడు తల్లిదండ్రులకు మూడవ సంతానం. పన్నెండుసార్లు శివపూజలు, వ్రతాలు చేసుకున్న తర్వాతనే ఈ బాలుడు వారికి జన్మించాడు. ఈ బిడ్డ అంటే వాళ్లకు అల్లారుముద్దు. చెప్పలేనంత గారాబం. శిశువు చాలా అందంగా ఉండటమే కాక ఎంతో బుద్ధిమంతుడిగా ప్రవర్తించేవాడు. మహేంద్రనాథుడికి చాలా చిన్నప్పటి సంగతులు కూడా ఆశ్చర్యకరంగా జ్ఞాపకం ఉండేవి. అటువంటి చిన్ననాటి జ్ఞాపకాలలో అత్యద్భుతమైన సన్నివేశం ఒకటి ఆయన హృదయఫలకాన చెరగరాని ముద్రవేసింది. 5 యేళ్ల పసివయసున ఆయన తల్లితో ఒకరోజు దక్షిణేశ్వరం కాళికాలయానికి వెళ్లాడు. తల్లి ఇతర భక్తులతో కలిసి కాళికా లయంలో పూజల్లో నిమగ్నమై ఉండగా బిడ్డడెలాగో తప్పిపోయి అమ్మవారి గుడికి

ఎదురుగా ఉండే మండపం చేరుకున్నాడు. అమ్మ కనపడకపోవటంతో పెద్దపెట్టున రాగాలు తీశాడు. ఈ సమయంలో ఒక వ్యక్తి అటువైపు వచ్చి పిల్లాణ్ణి బుజ్జగించి యేడ్పుమానిపించాడు. ఈ సన్నివేశం తరచు తన మనస్సులో జాగరూకమై స్పష్టంగా కళ్ల ముందు కనపడుతూఉంటుందని మహేంద్రనాధుడనేవాడు. కొత్తగా నిర్మించిన ఆ దేవాలయం, ఆ మండపం, ఆ ప్రసన్న మందహాస సుందరవదనారవిందుడైన వ్యక్తి తనకళ్ళ ఎదుట సాక్షాత్కారిస్తారనేవారాయన. ఆ వ్యక్తి శ్రీరామకృష్ణులే అయి ఉండ వచ్చునని అయన ఊహ.

మహేంద్రనాధుడు చిన్నతనం చదువుల్లో ఎప్పుడూ ప్రధముడిగా ఉండేవాడు. పాఠశాలకు పోయే దారిలో శీతాలాదేవిని దర్శించి వెళ్ళేప్పుడు వచ్చేప్పుడు కూడా భక్తితో తప్పక నమస్కరించిన కృతార్థుడైనాడు. విద్యార్థిగా ఉండగానే ఆనాటి బ్రహ్మసమాజ ప్రవక్తగా సువిఖ్యాతుడైన కేశవచంద్ర సేన్‌కు వరసకు చెల్లిలైన నికుంజదేవితో మహేంద్రుడికి 1874లో వివాహం జరిగింది. శ్రీఠాకూర్ చరణసేన్ కుమార్తె ఆమె.

శ్రీరామకృష్ణ పరమహంసకు పూజ్యమాత శారదాదేవికి నికుంజదేవి అంటే చాలా గారాబంగా ఉండేది ఒకసారి పుత్రశోకంతో నికుంజదేవి ఉన్మత్తురాలిగా ప్రవర్తించగా శ్రీ రామకృష్ణులు ఆమె వీపు నిమిరి శాంతినీ, స్వస్థతనూ అనుగ్రహించారు.

శ్రీ మహేంద్రనాధ్ చాలాకాలం అధ్యాపకుడిగా పనిచేశారు. అంతకు ముందు కొద్ది కాలం ప్రభుత్వోద్యోగమూ, ఒక వ్యాపార సంస్థలో ఉద్యోగము చేశారు. కాని ఆ మహానుభావుడి జీవితానికి అనుగుణమైన వృత్తిని భగవంతుడే అనుగ్రహించాడు. రిప్పన్ కాలేజి, సిటీ కాలేజి, మెట్రోపాలిటన్ కాలేజీలలో ఆయన ఆచార్యత్వం వహించి ఇంగ్లీషు, మనోవిజ్ఞానం, అర్ధశాస్త్రం బోధించారు. శ్రీ రామకృష్ణుల దగ్గరకు రాకపోకలు ప్రారంభించిన కాలానికి అంటే క్రీ.శ. 1882లో మహేంద్రనాధుడు శ్యాంబజారులో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మహాశయుల నిర్వహణలోని ఒక శాఖా పాఠశాలకు హెడ్ మాస్టర్‌గా పనిచేస్తున్నారు. విశేషం ఏమంటే శ్రీ రామకృష్ణుల దివ్యసన్నిధికి అనంతరకాలంలో ఆకర్షితులైన ఆయన అంతరంగ భక్తబృందం రాఖాల్, పూర్ణ, బాబూరామ్, వినోద్, బంకిమ్, తేజచంద్రక్షీరోద్, నారాయణ్ మొదలైనవారంతా శ్రీ మహేంద్రుడి బళ్లో చదువుకున్నవాళ్లే. అందువల్ల వీళ్ళంతా మహేంద్రనాధుణ్ణి 'మాస్టరు మహాశయా' అని సంబోధించేవాళ్ళు. అదే ఆయన పేరుగా రూఢమైపోయింది. చిన్నప్పటి నుంచీ మహేంద్రుడిలో ఆధ్యాత్మికతృష్ణ ఎక్కువగా ఉండేది. కేశవ చంద్రసేను ఉపాసన నిర్వహించే బ్రహ్మమందిరానికి తరచుపోయి అక్కడి కార్యక్రమాలలో ఆయన పాల్గొంటూ ఉండేవారు.

1882 ఫిబ్రవరి 26వ తేదీన మహేంద్రుడు అనుకోకుండా శ్రీ రామకృష్ణుల

దివ్యసన్నిధికి వెళ్ళారు. మహేంద్రుణ్ణి చూడగానే శ్రీ రామకృష్ణులు అతడు ఉత్తమ అధికారి అని గుర్తించారు. అతడి వదనంలో, కళ్లలో యోగిజీవనోచితమైన చిహ్నాలున్న వన్న సంగతి కూడా భగవాన్ అతడికి చెప్పారు. స్వామివారి దగ్గర సెలవు తీసుకొంటుండగా 'మళ్లీరా' అని కూడా చెప్పారు. అయితే అప్పటికి బ్రహ్మసమాజ ప్రభావం వల్ల మహేంద్రుడికి విగ్రహారాధనం పట్ల విశ్వాసం లేకపోయింది. అతడు గొప్ప పండితుడు. ఇంగ్లీషు, సంస్కృతం కూడా బాగా చదువుకున్నాడు. బౌద్ధధర్మం, బైబిలు కూడా శ్రద్ధావిశ్వాసాలతో అధ్యయనం చేశారు. ఉత్తరరామచరిత్రం, కుమార సంభవం, శకుంతలం, భట్టికావ్యం ఆయనకు కంఠపాఠంగా ఉండేవి. అందువల్ల ఆయనకు లోలోపల తాను పండితుణ్ణి అనే భావం ఉండేది. మొదటిసారి శ్రీ రామకృష్ణులను దర్శించగానే ఈ పాండిత్యాభిమానంపై ఆయన దాడి చేశారు. మహేంద్రుడికళ్లు తెరుచుకున్నాయి.

ఆ ప్రభువు సంసారంలో ఉంటూనె సన్యాసిగా ఎట్లా జీవించవచ్చో మహేంద్రుడికి ఉపదేశించారు. శ్రీ రామకృష్ణులు ఆయనకు మనస్సు భగవంతుడిపై ఉంచి ఏ పని చేసినా బంధకం కాదు అని చెప్పారు. సమయం చిక్కినప్పుడల్లా మహేంద్రుడు శ్రీ రామకృష్ణుని పాద సన్నిధికి చేరేవాడు. అన్ని వైపుల నుంచీశ్రీ రామకృష్ణులాయనను కాపాడారు. 1884 జనవరిలో ఆయనను వెళ్ళి ఇంటిలోనే నివసించవలసిందనీ అయినా ఆయన్ను సంసారం ఏమీచేయలేదనీ అనుగ్రహించారు. అలనాడు శ్రీ చైతన్య మహాప్రభువు సంకీర్తన మండలంలో మహేంద్రనాథుడొకరని శ్రీ రామకృష్ణుడు తమ దివ్యదృష్టితో కనుక్కున్నారు. శ్రీ చైతన్య భాగవతం మహేంద్రుడు విలక్షణంగా పఠించేవారు. శ్రీ రామకృష్ణులు ఎంతో ఆనందించి 'నీవు నా స్వంతవాడవు. నీవు నేను ఒకే పదార్థము. తెలిసినదా' అంటే పితాపుత్రుల వలె అన్నారుట. 'నీలో అహంభావం, దానభావము ఉన్నాయంటూ' తల్లి దగ్గర మహేంద్రుణ్ణి అనుగ్రహించ వలసిందని శ్రీ రామకృష్ణులు ప్రార్థించేవారుట.

శ్రీ రామకృష్ణుల జీవిత కాలంలోనే మహేంద్రుడు సన్యసించలేకపోయినానని చాలా పరితపించేవారుట. శ్రీ రామకృష్ణులా తణ్ణి ఓదారుస్తూ, మనసా త్యజించటమే అసలు త్యాగం, ఇక్కడికి వచ్చే గృహస్థులు సంసారాసక్తులు కారు సుమా! అని బుజ్జగింపుగా పల్కేవారుట.

శ్రీ రామకృష్ణుల సందేశాన్ని లోకానికి చాటగల భక్తి ఆయనకు శ్రీ రామకృష్ణులే అనుగ్రహించారు. నరేంద్రనాథుడికి మహేంద్రుడేవిషయంలో ఏ మాత్రం తీసిపోడని చరిత్రకారులు వ్రాశారు. 14-12-1883 నుంచి ఒక నెల రోజులపాటు మహేంద్రుణ్ణి దక్షిణేశ్వరంలో ఉండటానికి అనుమతించి ఆయనచే ఎడతెగని సాధనలు చేయించారు

శ్రీ రామకృష్ణులు. జ్ఞాన, భక్తి, కర్మ యోగాల రహస్యాలు విప్పి చెప్పారు. మహేంద్రుణ్ణి ఆయనెంతగానో అనుగ్రహించారు. అందువల్లనే ఆయన శ్రీ రామకృష్ణుల దివ్యవాణిని 'శ్రీ రామకృష్ణ కథామృతము' అనే పేర అందజేశాడు. మహేంద్రుడికి తన వ్యక్తిత్వం వెల్లడిచేయటం ఏ మాత్రం ఆసక్తి లేదు. ఆయనకు చిన్నప్పటి నుంచి డైరీ రాసే అలవాటుండేది. మహేంద్రుడు తన వ్యక్తిత్వం ఏ మాత్రం బయట పెట్టకుండా కథామృతాన్ని ఐదు భాగాలుగా చిత్రించారు. 'మణి, మోహినీ, మోహన్, ఒక భక్తుడు, మాస్టర్, శ్రీమ, ఇంగ్లీషుమాన్' మొదలైన మారుపేర్లతో ఈ కథామృతాన్ని ఆయన లోకులకిచ్చాడు. ఆయన పాఠశాల ప్రధానోపాధ్యాయుడిగా పనిచేస్తూనే శ్రీ రామకృష్ణుల సన్నిధిని వీలైనప్పుడల్లా గడిపేవాడు. ఒక సంవత్సరం పాఠశాల పరీక్షా ఫలితాలు సంతృప్తికరంగా లేకపోయినందువల్ల ఈశ్వరచంద్రులు ఎత్తి పొడుపుగా 'మాస్టరుకు పరమహంసతోనే పొద్దంతా గడిచిపోతున్నది. స్కూలు బాగోగులు పట్టించుకొనే సమయం ఎక్కడిది?' అన్నారుట. ఈ విషయంలో శ్రీ రామకృష్ణుల పేరు తీసుకొని రావడంతో మనస్సు చాలా కష్టపెట్టుకొని మహేంద్రుడు వెంటనే తన ఉద్యోగానికి రాజీనామాచేశాడు. ఈ సంగతి రామకృష్ణులకు తెలిసి 'మంచిపని చేశావు. తల్లి ఏదోవిధంగా చూసుకుంటుందిలే' అన్నారుట.

శ్రీ రామకృష్ణులు ఏదైనా తమకు అవసరమైతే మహేంద్రుడికే చెప్పేవారు. తనకవసరమైనవస్తువులేవీ ఇతరుల దగ్గర నుంచిశ్రీ రామకృష్ణులు తీసుకునేవారుకారు. ఎంతో పేదరికం అనుభవిస్తున్నా ఆయన ఏ మాత్రం చలించేవారు కాదు. తన సాధనలకు ఆటంకం కలుగుతుందనుకున్నా ఆదర్శాలకు విరుద్ధంగా నడవాల్సి వచ్చినా సంసారం ఎట్లా గడుస్తుంది అనే చింత లేకుండా తన పదవికి రాజీనామా ఇచ్చేవారు మాస్టర్ మహాశయులు.

శరణాగాతుడు, నిరభిమాని, ఆదర్శవాది అయిన ఆ మహనీయుడి సంసార భారం భగవంతుడే నిర్వహించాడు. శ్రీ రామకృష్ణ పరమహంస మహా సమాధి అయినతర్వాత ఆయన శిష్యులు బారానగర్‌లోఒక మఠం స్థాపించారు. మహేంద్రుడు, బలరామ్, సురేశ మిత్ర ఈముగ్గరే మఠనిర్వహణలో ఎక్కువ కర్తవ్యం నిర్వహిస్తుండేవారు. ఈ కాలంలో మహేంద్రుడు రెండుచోట్లపనిచేస్తూఒక జీతం మఠానికి సమర్పించేవారు.

1890-93 వరకు నరేంద్రుడు పరివ్రాజక పర్యాటకుడు. ఆయన బాటలోనేఇంకా కొందరు మఠ శిష్యులు దేశాటనకి బయలుదేరారు. ఈ సమయంలో మహేంద్రుడు తన పాత డైరీలను చదువుతూ శ్రీ రామకృష్ణుల ఉపదేశాలు మననం చేస్తూ గడిపేవారు.

మహేంద్రుడు మాతృశ్రీ శారదాదేవిని ఎంతో భక్తితో సేవించుకొనేవారు.

అప్పుడప్పుడామెను తన ఇంటికి తీసుకొని వెళ్లి సేవించుకొనేవాడు.

మనస్సు ఏదైనా సందిగ్ధంలో పడితే శ్రీ శారదాదేవిని శరణుజొచ్చేవాడు. మాతృదేవికి కూడా మహేంద్రుడంటే పుత్రప్రేమ. ఆమె వాళ్ళింట్లో ఎటువంటి మొహమాటం లేకుండా స్వేచ్ఛగా తనకిష్టమున్నన్ని రోజులుండేది. ఒక్కోసారి నెలల తరబడి వాళ్ళింట్లోనే ఉండేది. 1899 నుంచి మాతృదేవి అవసరాల నిమిత్తం ఆయన కొంత డబ్బు పంపేవారు.

శ్రీ రామకృష్ణుల నిర్యాణానంతరం మహేంద్రుడు తరచు వరాహనగరం మఠానికి పోయి తన సోదర శిష్యబృందంతో నివసిస్తూ ఆధ్యాత్మిక సాధనలతో కాలం గడిపేవారు. త్యాగజీవితాదర్శాలు తనలో గాఢంగా నాటుకొనేట్లుగా ఆయన సాధనలు చేసేవారు. ఈశ్వరుడిపై సంపూర్ణంగా ఆధారపడటానికి సర్వవిధాలా ఆయన ప్రయత్నించేవాడు.

విశ్వమానవులలో తాను ఒకడనని నిరుకు చేసుకోవడానికి రాత్రిళ్లు ఇల్లు విడిచి పెట్టి సెనెట్ హాలు ముందు ఫుట్‌పాత్‌పై నిద్రించేవాళ్ళ మధ్య పడుకొనేవారు శ్రీమహేంద్రుడు. అప్పుడప్పుడు దక్షిణేశ్వరాలయం వెళ్ళి సాధువులలాగా కఠోర తపస్సు చేస్తూ దార్లో చెట్ల కిందనే పడుకొనేవారు. ఒక్కోసారి హీరాస్టేషన్‌కు పోయి సాధువులకు ప్రణామాలు చేసి వారి దగ్గర నుంచి ప్రసాదం స్వీకరించి తాను తిని ఇతరులకు పంచుతూ 'ప్రసాదం మనలను భగవంతునితో కలుపు వస్తువు సుమా' అనేవారు.

శ్రీరామకృష్ణుల ఉపదేశాలను గ్రంథం రూపంగా వెలువరించాల్సిందిగా ఎందరో మహేంద్రుణ్ణి అర్థించారు. కాని ఆయన ఉత్సాహం చూపలేదు. ఒకరోజు శ్రీ శారదామాత కోరికపై శ్రీ రామకృష్ణుల ఉపదేశం విన్పించారు. శ్రీ మాత శారదాదేవి ముగ్ధురాలై ఆనందంతో అతడిని ఆశీర్వదించి 'నాయనా నీవు చదువు తున్నప్పుడు స్వయంగా వారే (ఠాకూర్ శ్రీ రామకృష్ణులు) పల్కుతున్నట్లుగా అనిపించింది సుమా' అని దానిని పుస్తక రూపాన ప్రచురించవలసిందిగా కోరడం జరిగింది.

క్రీ.శ. 1897వ సంవత్సరాన మహేంద్రుడు 'Gospel of Sri Ramakrishna According to M. a son of the Lord and disciple' అని ఉపదేశాలను ప్రచురించారు. ఆ తర్వాత మాతృదేవి ఆశీస్సులతో 1902లో శ్రీ రామకృష్ణ కథామృతం ఆయన బెంగాలీలో ప్రచురించారు.

1897లో 'గోస్పెల్ ఆఫ్ రామకృష్ణ'అనే పేరుతో రెండు కరపత్రాలు వెలువడ్డాయి. శ్రీ వివేకానంద స్వామి వీటిని ఎంతగానో మెచ్చుకున్నారు. "వానిని నేనెట్లు ఆస్వాదించి యానందించితినో చెప్పుటకు నాకు మాటలు చాలవు. వానిని చదువునప్పుడు లోకాంతరములో విహరింతును. ఏమివింత! కాదా ? మన గురువు

మన భగవానుడు అంతటి స్వతఃప్రజ్ఞ కలవారు. ఆయన జీవితమును వ్రాయుటకు మేమెవ్వరము మున్నెన్నడును ఏల తలపెట్టలేదో నాకిప్పుడు తెలియుచున్నది. అది ఆ మహత్కార్యము, మీకై ప్రత్యేకింపబడియున్నది. ఆయన మీతోనున్నాడను స్పష్టము అని వ్రాశారు. శ్రీ కథామృతం 2,3,4,5 భాగాలు వరసగా 1905, 1907, 1910, 1932లో ప్రచురితమైనాయి.

కథామృతాన్ని గూర్చి శ్రీ ప్రేమానందస్వామి ఇట్లా ప్రశంసించారు! 'శోకమోహాలతో నిండి సంసారంలో పరితపించే వందలాది జనులు కథామృతం చదివి శాంతి పొందుతున్నారు. వేలకువేలు ప్రాణాలు నిలబెట్టుకొని జీవిస్తున్నారు. లక్షలాది భక్తులు ఆనందోప లబ్ధి సాధిస్తున్నారు. శ్రీ రామకృష్ణ కథామృతం వెలువడ్డ తర్వాత మాతృదేవిని సందర్శించే భక్తుల సంఖ్య కూడా గణనీయంగా పెరుగుతూవచ్చింది.

మహేంద్రనాథుడు తన జీవితాన్నంతా రామకృష్ణమయం చేసుకున్నారు. శ్రీ రామకృష్ణుల ఆదేశం శిరసావహించి తన వద్దకు వచ్చిన భక్తులకాయన భాగవతం వినిపించేవారు. తన దగ్గరకు వచ్చే బాలభక్తులను పరీక్షిస్తూ వాళ్లలో వివేక వైరాగ్యాలు కనపడితే 'మీరు మాటలు వింటూ వ్యర్థంగా కాలం గడపవద్దు. త్యాగజీవితాదర్శములను కళ్ళారా చూసి మీ భావి జీవితాలు నిర్ధారణ చేసుకోండి'. అని వాళ్ళను బారా నగరానికిపంపించేవారు.

మహేంద్రుడు శ్రీ రామకృష్ణుల సన్నిధికి మొట్టమొదట రావడం కూడా దైవ ప్రేరణతో కూడిన ఒక అద్భుత సంఘటనమే. మహేంద్రుడిది పెద్ద కుటుంబం. ఇంటివాళ్ళ మధ్య మనఃస్పర్ధలతో ఆయన చాలా కృంగిపోయినాడు. పొద్దస్తమానూ ఇంట్లో కనపడేజగడాలతో ఆయన విసిగివేసారిపోయినాడు. ఆత్మహత్య చేసుకోవాలన్నంత కష్టం కలిగిందాయనకు. అర్ధరాత్రి ఇల్లు వదలి పెట్టి అప్రయత్నంగానడిచినడిచి బారానగర్‌లో ఉన్న తన అక్కగారి ఇల్లు చేరాడాయన. ఉదయాన్నే లేచి మేనల్లుడితో కలకత్తాలోని ఉద్యానవనాలు చూసుకుంటూ దక్షిణేశ్వరం చేరాడు. శ్రీ రామకృష్ణులను దర్శించగానే ఆయనలో జీవితాశయాలు గురించి ఉత్సాహం, ఉత్తేజం కలిగాయి. ఆ తర్వాత ప్రస్తావనవశంగా మహేంద్రనాథుడిలా అనేవారు. 'చావడానికి సిద్ధపడ్డాను. కాని నా కోరిక నెరవేరలేదు. కాని భగవంతుణ్ణి కనుక్కొన్నాను. నిజంగా కష్టాలు, దుఃఖాలు కూడా మనకు ఉపకారమే చేస్తాయి. అవి కూడా మన స్నేహితులే సుమా! ఒక్కోసారి వీటిమూలంగానే మనకు ఉన్నత స్థితి కలుగుతుంది. భగవంతుడేదైనా మన మేలుకే చేస్తాడు అని గ్రహించగలిగాను!'

శ్రీ రామకృష్ణ భగవానుడి జీవితకాలంలో ఆయన భక్తులలో మహేంద్రుడే మొట్టమొదటిసారి గురుదేవుని జన్మస్థలమైన కామార్పుకూరు పుణ్యక్షేత్ర సందర్శనం

చేశాడు. కామార్పుకూరు గ్రామంలో విశేషమైన ప్రదేశాలలో సాష్టాంగ నమస్కారాలాచరించాడు. అక్కడి మట్టిలోని ప్రతి రేణువు ఆయనకు పరమ పవిత్రమనిపించింది. అందుకని ఆయన అక్కడి మట్టిని కొంత తనతో తెచ్చుకున్నాడు. ఈ మాట విని శ్రీ రామకృష్ణులు ఆనందం చెందారు. మహేంద్రుడి వీపు నిమురుతూ 'నీవు పరిశుద్ధుడవు. అందువల్లనే నీవు పవిత్రతను గుర్తించగలిగావు' అన్నారు.

శ్రీరామకృష్ణ కథామృతాన్ని పుస్తకరూపంలో కూర్చేకాలమంతా ఆయన ఎంతో నిష్ఠతో ఏకభుక్తంగా ఈ పరమపావన భాగవత చరితను గ్రథించాడు. సాంసారిక విషయాలను మాట్లాడేవాడే కాదు. నాలుగు భాగాలు ముద్రణ అయి అయిదో భాగం పూర్తి అయి ముద్రణ జరుగుతున్నప్పుడు శ్రీ మహేంద్రనాథుడు పరమపదించారు. ఇది భాగవత తుల్యమైన పవిత్ర గ్రంథం.

కారణ జన్ముడు శ్రీ రామకృష్ణుల అంతరంగభక్తి కోటికి చెందిన శ్రీ మహేంద్రనాథుడు 78 సంవత్సరముల వయస్సున గురూపదిష్టవ్రతోద్యాపనం పూర్తిచేసుకుని 'గురుదేవా! అమ్మా, నన్ను మీ ఒళ్ళో చేర్చుకోండి' అంటూ ప్రశాంతంగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలులయింప జేశారు. కాశీపూరు స్మశాన వాటికలో ఈ మహానుభావుడి అంత్యక్రియలు జరిగాయి.

శ్రీ రామకృష్ణుల సమాధి పక్కనే ఆయుగావతారుడి చిరదాసుడగు మహేంద్రనాథ మహాశయుడి సమాధి కూడా నెలకొన్నదని శ్రీ రామకృష్ణ కథామృతం ప్రథమ భాగం ఎంతో అందంగా తెలుగు చేసిన ఆ నిర్వాణానందులైన ఆ స్వామివారు ఎవరో కాని చక్కగా వ్రాశారు. అంటే మహేంద్రనాథుడి నిర్యాణం 1932.

సర్వార్థ సంక్షేమ సమితి,
201, ప్రదీప్ అపార్ట్‌మెంట్ గాంధీనగర్ హైదరాబాద్ - 380.

## సభ్యులుగా చేరండి - ధార్మిక సేవలో పాల్గొనండి

| | | సర్వార్థ సంక్షేమ సమితి సభ్యత్వ వివరములు | విశ్వప్రకాశం సభ్యత్వ వివరములు |
|---|---|---|---|
| 1 | మహారాజపోషకులు | రు. 1,00,000-00 | రు. 15,000-00 |
| 2 | రాజపోషకులు | రు. 50,000-00 | రు. 10,000-00 |
| 3 | పోషకులు | రు. 25,000-00 | రు 5,000-00 |
| 4 | కార్యనిర్వాహక సభ్యత్వము | రు. 10,000-00 | - |
| 5 | శాశ్వత సభ్యత్వము | రు. 1,000-00 | రు. 1,000-00 |
| 6. | వార్షిక సభ్యత్వము | రు. 100-00 | రు. 60-00 |
| 7 | ద్వివార్షిక సభ్యత్వము | | రు. 120-00 |
| 8 | విడి ప్రతి | - | రు. 5-00 |

పై సభ్యత్వములకు చెక్కు లేదా డి.డి. ద్వారా లేదా నగదు రూపకంగాను స్వీకరించబడును. మరియు 80 G ఇన్‌కంటాక్సు లబ్ది పొందవీలగును.

*విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రికకు*
*ప్రకటనలు పంపండి, ప్రోత్సహించండి*

## పత్రికా ప్రకటన వివరములు

| | | |
|---|---|---|
| 1. | వెనుక కవరు పేజీ | రు.2,500-00 |
| 2. | రెండవ కవరు పేజీ | రు.1,500-00 |
| 3. | మూడవ కవరు పేజీ | రు.1,500-00 |
| 4. | లోపలి పూర్తి పేజీ | రు. 500-00 |
| 5. | 12 మాసాలకు 12 సంచికలకు చిన్నసైజులో | రు.2,500-00 |

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి




ఆలయములు వేరైనా ఆరాధకుడొక్కడే. మతాలు వేరైనా ఆశయం ఒక్కటే
మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** Printed Matter

To

______________________

______________________

______________________

*If undelivered please return to,*
SARVARTHA SANKSHEMA SAMITHI
501, Pradeep Apartments, Gandhinagar, Hyd-38

**Edited, Printed & Published by Sri P.V. Manohara Rao, Sarvaartha Sankshema Samithi, Hyderabad-20**
**Designed at *Advanced Graphic Systems*, Hyd-20,** Printed at Padmasri Graphics, 1-1-770/5,